104
105

జూన్/జులై
1980

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక
మాస పత్రిక

## కొన్ని వాక్యాలు

యుద్ధరంగంలో నిలబడి
కవిత్వం రాయడం గొప్ప ఆనందాన్నిస్తుంది
ఇక్కడ కవిత్వం తన కృత్రిమ మృదుత్వాన్ని కోల్పోతోంది
అనాగరికంగా, నిర్దాక్షిణ్యంగా జీవితం యిక్కడ
నగ్నమైన భౌతిక వాస్తవాలతో పోటీపడుతోంది
కన్నీళ్ళతో, చెమటతో కలిసి
రక్తం వరదలై పారుతోంది
పైశాచికత్వం అహింసాశ్రమం స్వీకరించి
మనుషుల్ని మాత్రమే తింటోంది
పువ్వులూ, వెన్నెల రాత్రులూ సైతం
ఇక్కడ రక్తంలో మునిగి వున్నాయి
దీనికి నాగరికుల కవితా జ్ఞానసర్వస్వాల్లో చోటులేదు
చనిపోయిన వాళ్ళతో సహగమనం చెయ్యడం మాకిష్టం లేదు
మాకోసం మరో ప్రపంచం ఎదురు చూస్తోంది
దాని పునాదులు పాత ప్రపంచపు సమాధుల మీదనే లేస్తాయి
అక్కడ కవిత్వం
ఇంకెంత మాత్రమూ యుద్ధాలు చెయ్యదు.

— మొలీనా

---

నిర్వహణ
'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా రు. 20 | ఈ సంచిక రు. 2

# విరసం దశాబ్ది ఉత్సవాలు

## 1980 అక్టోబర్ 17, 18, 19 - హైదరాబాదు

ఈ అక్టోబర్‌కు విరసం ప్రథమ మహాసభలు జరుపుకొని పది సంవత్సరాలు. ఈ సందర్భంగా విరసం ఎనిమిదో మహాసభ సంస్థ దశాబ్ది మహోత్సవంగా అక్టోబర్ 17, 18, 19 తేదీలలో హైదరాబాదులో జరుగుతుంది.

ఆనాటికి ఈ దశాబ్దంలో కొడవటిగంటి కుటుంబరావు సాహిత్య వ్యాసాలు విరసం చరిత్ర, ఝంఝ - 2 వెలువడుతాయి. ఝంఝ - 2 లో ప్రచురణార్థం సభ్యులు తమ వచన కవితల్ని ఆగస్టు 31 లోగా కెవి రమణారెడ్డి, 11-33-957 కావలి, నెల్లూరు జిల్లా 524 202 కు పంపించాలి.

మహాసభ కార్యక్రమంలో...

1- ఈ దశాబ్దంలో విప్లవ కవిత, కథ, నవల, పాటలు, సాహిత్య విమర్శ

2- సాహిత్యంలో మార్క్సిస్టు దృక్పథం

3- ప్రజాపోరాట సాధనాలుగా సాహిత్య కళా ప్రక్రియలు

4- శ్రీశ్రీ సాహిత్య సమీక్ష, కుటుంబరావు సాహిత్య సమీక్ష

5- కవి సమ్మేళనం ఉంటాయి-

విరసం పత్రిక 'అరుణతార' అక్టోబర్ నుంచి మాసపత్రికగా వెలువడుతుంది. బెంగాలీ మరాఠీ, కన్నడ సాహిత్యాల్లో ప్రజాస్వామిక దృక్పథం గల ప్రముఖ రచయితలు సౌహార్ద ప్రతినిధులుగా పాల్గొంటారు.

విప్లవ సాహిత్యాభిమానులు ఆర్థికంగానూ, అన్నివిధాలా సహకరించి ఈ దశాబ్ది ఉత్సవాలను జయప్రదం చేయవలసిందిగా సంస్థ కార్యదర్శి కె వి ఆర్ కోరుతున్నారు.

# సృజన

104/105 మాస పత్రిక జూన్/జులై 1980


కవర్‌పై కవిత 'ఆంధ్రజ్యోతి' వారపత్రిక సౌజన్యంతో

SRJANA is commended for use in Public Libraries in the
tate by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd.
ide Ref No. 182/A4/67, dated 22-9-1967.

dited, Printed & Published by P Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Warangal Printing Press, J.P N. Road, Warangal.
for. Venkataramana Mudranalayam,
Working Editor: Varavararao

సంవత్సర చందా రు. 20 ఈ సంచిక రు 2

# స్వవిషయం

మే ఆఖరు వారంలోనే జూన్ సంచికగా వెలువడవలసిన సృజన జులై ఆఖరులోగానీ జూన్/జులై సంచికగా వెలువడలేక పోతున్నందుకు విచారిస్తున్నాం. అయితే ఈ ఆలస్యానికి 'సాహితీ మిత్రులు' అసహాయబాధ్యులు. సకాలంలో ఆ సంచికకు సంబంధించిన రచనలు అందించడంలోనో ఇతర ఏర్పాట్లలోనో జరిగిన జాప్యం కాదిది. సృజన అచ్చవుతున్న ప్రింటింగ్ ప్రెస్ చాలకాలం మూతపడ్డది. అచ్చయిన, వేయవలసిన రచనలతోసహా కాగితం వగయిరా వనర్లన్నీ ఆ ప్రింటింగ్ ప్రెస్‌లోనే వుండిపోయి తన పరిధికి, పరిమితులకు మించిన విలంబన కార్యక్రమానికి సృజన కేవలం మౌన సాక్షి ప్రేక్షక స్థానంలోనే వుండిపోవాల్సివచ్చింది. అంతే కాదు పాఠకులకు అనివార్యమైన ఇబ్బంది కలిగించే కష్టమూ, నష్టమూ కూడ వహించవలసివచ్చింది.

ఇప్పటికయినా ఈ ఇబ్బందులను సృజన అధిగమించిందని చెప్పలేం. కాని ఎన్ని ఇబ్బందులనయినా ఎదుర్కొని ఇక నుంచి సృజన క్రమం తప్పకుండా అందించడానికి తీవ్రమైన కృషి చేయగలమని మాత్రమే పాఠకులకు హామీ యివ్వగలం.

ఈ ఆలస్యంవల్ల సృజనవద్ద రచనలు చాలపేరుకొనిపోతున్నాయి, ముఖ్యంగా సాహిత్య విమర్శకు, సమీక్షకు సంబంధించిన రచనలు, అయా సంచికలలో వచ్చిన రచనలపై అభిప్రాయాలు, చర్చలు చాల మిగిలిపోతున్నాయి. నవంబర్‌లో వెలువడిన స్త్రీల సంచిక మొదలుకొని 100వ సంచిక దాకా అభిప్రాయాలు ప్రచురించడం కష్టసాధ్యం అవుతున్నది. కొన్ని సమస్యలపై సృజన వెలిబుచ్చవలసిన అభిప్రాయాల అడుగున బడిపోవడమో, వెనుకబడిపోవడమో, కాలదోషంపట్టడమో కూడ జరుగుతున్నది. ఆమాటకొస్తే సంచిక ప్రెస్‌కు ఇచ్చినపుడు చాల ముఖ్యమనిపించిన అంశాలు ఈ అనివార్యమైన ఆలస్యంలో పాతబడి కూడ పోతున్నాయి.

స్త్రీల సంచికపై విశాఖ పాఠకుని అభిప్రాయంపై రంగనాయకమ్మగారి ఉత్తరం ఈ సంచికలోగానీ వేయలేకపోతున్నాం. మరీ ఆలస్యమయిపోయినందున ఒకే సంచికలో పెద్దదయినప్పటికీ మొత్తంగా వేయాల్సి వచ్చింది. సెప్టెంబర్, అక్టోబర్‌లలో వచ్చిన మార్క్సిజం-సాహిత్యం (త్రిపురనేని మధుసూదనరావు) వ్యాసంపై ఎ. సురేంద్రరాజు గారి సుదీర్ఘ లేఖ ఈసంచికలో ప్రారంభం మాత్రమేచేయగలిగాం. సృజనకున్న 80 పేజీలను దృష్టిలో పెట్టుకొని రచనలు చేయవలసిందిగా మాత్రం పాఠకులకు విజ్ఞప్తి చేస్తున్నాం, ముఖ్యంగా స్త్రీల సంచికపై ఎ.ఎస్, సాహితీ మిత్రుల చర్చలో పాల్గొన్న పాఠకులు చాలమంది వున్నారు. పాల్గొన దల్చుకున్న

## తీర్పు

కారణం చూపనక్కర్లేని, కోర్టుకుపోవడానికి వీల్లేని, రాజ్యాంగంలోని 311 (2) సి క్లాజు కింద ప్రభుత్వ ఉద్యోగాల నుంచి తొలగించబడిన చెరబండ రాజు, లోచన్‌ల అపీల్‌ను అనుమతిస్తూ ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తులు జస్టిస్ ముక్తధర్, జస్టిస్ మాధవరెడ్డి ప్రభుత్వ ఉత్తర్వులను రద్దు చేసారు. హైకోర్టు డివిజన్ బెంచ్ నాలుగు రోజుల పాటు వాద ప్రతివాదాలు విని జులై 17న తీర్పు వినిపించింది

ప్రభుత్వ భద్రతకు భంగం కలిగించే. చెప్పడానికి వీలులేని ఆరోపణలు వీరిపై వున్నాయని విశ్వసించడానికి న్యాయమూర్తులకు అనుమాన ప్రమాణం కూడ కనిపించలేదు. ఈకవులిద్దరూ విప్లవ రచయితల సంఘ సభ్యులని, వీరు హింసను ప్రేరేపించే రచనలు చేసారని చేసిన ఆరోపణల్లో మొదటిది ఎంత సత్యమో రెండవది అంత పాక్షిక సత్యం, పీడక వర్గం విచ్చలవిడిగా కొనసాగిస్తున్న హింస, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా 'ట్రిగర్ మీద వేళ్ళతో' విప్లవ ప్రతిహింసకు పూనుకొమ్మని ప్రబోధించారు వీళ్ళు. వీళ్ళ భావాలు, ఆలోచనలు అక్షరబద్ధమయినవి. రచనల ద్వారా గానీ ఉపన్యాసాల ద్వారా గానీ బహిరంగంగా ప్రజల్లోకి పోయినవి. కొన్ని మరీ తెలివి తక్కువ ఆరోపణలు, ఉదాహరణకు లోచన్‌ను సికిందరాబాదు కుట్ర కేసులో ముద్దాయి అన్నారు. సికిందరాబాదు కుట్ర కేసులో ముద్దాయి లెవరో, కాని లెవరో పోలీసులకు కూడ జ్ఞాపకం లేనంత కాలయాపన జరిగిందనడానికి ఈఆరోపణ

---

పాఠకులు కూడ వున్నారు. వారికి ఎంతవరకు అవకాశమివ్వగలమో ఈ పరిస్థితుల్లో నిశ్చయంగా చెప్పలేం. ఇంతలో శ్రీశ్రీ సంచికపై, 100వ సంచికపై కూడ ఉత్తరాలు వస్తూనే వున్నాయి. పత్రిక నెలనెలా తప్పకుండా తేగలిగితే ఈ సాహిత్య తృష్ణను తీర్చడం సాధ్యమే.

1979 జులై నుంచి 1980 జులై వరకు సుప్రసిద్ధ హిందీ రచయిత ప్రేమ్ చంద్ శత జయంతి, కాబట్టి జులై సంచిక అయినా ప్రేంచంద్‌పై ఒకటి రెండు ప్రత్యేక వ్యాసాలతో తేవాలని అనుకున్నాం జూన్ సంచికే జులై సంచికగా కూడ వెలువడడంతో అది సాధ్యం కాలేదు ఆగస్టు నెలాఖరున వెలువడే ఆగస్టు సంచికలో ప్రేమ్‌చంద్‌పై కొన్ని ప్రత్యేక వ్యాసాలు ప్రచురించే ప్రయత్నం చేయగలమని మాత్రమే ప్రస్తుతానికి చెప్పగలం.

మా ఇబ్బందులను సానుభూతితో అర్థంచేసుకొని సృజన తిరిగి సక్రమంగా వెలువడడానికి పాఠకులు సహకరిస్తారని ఆశిస్తూ

— 'సాహితీ మిత్రులు'

కన్న మరో నిదర్శనమేం కావాలి? విప్లవ కారులతో పాటు విప్లవ రచయితలపై సికిందరాబాదు కుట్రకేసు మోపి ఆరు సంవత్సరాలకు పైగా గడచిపోయింది. ఆ కేసులో ముద్దాయిగా 1974 మే 18వ తేదీన సస్పెండ్ చేయబడిన చెరబండరాజు ఈ హైకోర్టు తీర్పు తర్వాత పెనం మీంచి పొయ్యిలోకి, తిరిగి పొయ్యిలోంచి పెనం మీదికి మాత్రమే మారాడు. ఈ కుట్ర కేసులో ముద్దాయిలయిన ఉద్యోగులందరూ తిరిగి ఉద్యోగాల్లోకి చేర్చుకోబడ్డారు. ఒకరిద్దరిపై ప్రభుత్వం కేసు కూడ ఎత్తివేసుకున్నది. కాని ఒక్క చెరబండరాజు మాత్రం ఈ 'అపూర్వమైన', అనుకూలమైన హైకోర్టు తీర్పు తర్వాత కూడ సస్పెన్షన్‌లోనే వుంటాడు. మరొకవంక ఇందరిలో చెరబండరాజు మాత్రమే రెండుసార్లు 'పునర్జన్మ' ఎత్తాడు. రెండవసారి బ్రెయిన్ ట్యూమర్ ఆపరేషన్ అయిన తర్వాతనే ఆయన వ్యాధి గురించి దేశవ్యాప్తంగా మేధావులు, రచయితలు, ప్రజాస్వామ్యవాదులు ఆందోళన చెంది ఉద్యోగంలోకి తీసుకోవాలని కోరిన తర్వాతనే గవర్నర్‌గారు ఆయనను ఉద్యోగం నుంచి తొలగించారు. చెరబండరాజును ఉద్యోగంలోకి తీసుకోవాలనే ప్రజాందోళన అవసరం ఎప్పటికన్న ఇప్పుడు ఎక్కువగా వుందని గుర్తుచేయడానికే ఈ ప్రస్తావన

ఇంతకన్న ప్రజాస్వామ్యవాదులు పట్టించుకోవాల్సిన అంశం రాజ్యాంగంలోని 311 (2) సి క్లాజు. ప్రభుత్వ ఉద్యోగులను, ఉద్యోగ సంఘాలను, కార్మిక సంఘాలను తన అదుపులో పెట్టుకోవడానికి, రాజ్యాంగమే గ్యారంటీ చేసిన ప్రాథమిక హక్కులను వినియోగించుకోకుండా బెదిరించడానికి ప్రభుత్వం ఈ దావా పిర్యాదు లేని చట్టాన్ని పిచ్చివాని చేతిలోని కత్తిలా ఝళిపిస్తూ వుండే ప్రమాదం ఈ క్లాజు వున్నంత కాలం వుంటుంది. కాబట్టి ప్రజాస్వామ్యవాదులందరూ కారణం చెప్పకుండా, కోర్టుకు పోవడానికి వీలు లేకుండా ఉద్యోగం నుంచి తొలగించే ఈ అప్రజాస్వామికమైన క్లాజును రాజ్యాంగం నుంచి తొలగించాలని దేశవ్యాప్తంగా ఉద్యమం నిర్మించాల్సిన అవసరం ఇప్పటికైతే హైకోర్టులో విజ్ఞుల అపహాస్యానికి గురైన ఈ 'ప్రభుత్వ ఆజ్ఞ' మనకు గుర్తు చేస్తున్నది. ఎందుకంటే సాధారణ చట్టాలకన్న ఎమర్జెన్సీకి, పార్లమెంటుకన్నా, బాధ్యతాయుతమైన అధికారంకన్న, బాధ్యతారహితమైన రాజ్యాంగేతర అధికారానికి, ప్రజాస్వామ్యంకన్న కుటుంబ స్వామ్యానికి, వ్యక్తి స్వామ్యానికి, మెదడు స్థానంలో, బూడిద మోస్తున్న మంత్రాంగానికి గిరాకీ, గుర్తింపు దొరుకుతున్న వ్యవస్థలో ఉన్నత పీఠాల నుంచి వివేకమూ, విజ్ఞతా యాదృచ్ఛికాలే కానీ ఎల్లప్పుడూ ఆశించగలిగేవికావు. ప్రజల వివేకమొక్కటే ప్రజలకు రక్ష.

— 'సంపాదకుడు'

సాహిత్య విమర్శ - ప్రసంగ వ్యాసం :
(విరసం 7వ మహాసభలు, తిరుపతి)

# గతితార్కిక సాహిత్య భౌతికవాదం

త్రిపురనేని మధుసూదనరావు

గతితార్కిక భౌతికవాద ప్రాపంచిక దృక్పథం నుంచి సాహిత్యాన్ని పరిశీలించటం గతితార్కిక సాహిత్య భౌతికవాదం అంటారు. గతితార్కిక భౌతికవాదం ప్రకృతి పరిణామ, సామాజిక పురోగమన సూత్రాల పరస్పర శాస్త్రం. మార్క్సిజం - లెనినిజం మావో ఆలోచనా విధానం అన్నా గతితార్కిక భౌతికవాదం అన్నా ఒకటే. గతితార్కిక భౌతికవాదం ఒక తత్త్వశాస్త్రం కాదు. ఒక సిద్ధాంతం కాదు. వాద వినోదుల విందు భోజనం కాదు. అది అన్వయ శాస్త్రం. విప్లవ శాస్త్రం. ఆచరణ శాస్త్రం. సర్వాంగ ప్రాపంచిక దృక్పథం. మార్క్స్ నుంచి లెనిన్‌నీ లెనిన్ నుంచి మావోనీ వాళ్ళ ఆచరణ నుంచి వాళ్ళ అభిప్రాయాల్నీ వేరుచేసి సిద్ధాంతాలు చేయటం అశాస్త్రీయం. గతితర్కం నుంచి భౌతికవాదాన్నీ గతితార్కిక భౌతికవాదం నుంచి చరిత్రనీ, సామాజిక చరిత్ర నుంచి సాహిత్యాన్ని వేరుచేసి సిద్ధాంతాలు చేయటం అశాస్త్రీయం.

ఉత్పత్తి శక్తులూ ఉత్పత్తి సంబంధాలూ పునాది. రాజకీయాలు, న్యాయశాస్త్రం, తత్త్వశాస్త్రం, మతం, సాహిత్యం, కళా సాహిత్య విమర్శలు ఉపరితలం. పునాది, ఉపరితలం ఒక అవయవిలో అవయవాలు. గతితార్కిక భౌతికవాదం అవయవి ప్రాపంచిక దృక్పథం. అవయవం అవయవిలో భాగంగా వున్నప్పుడే సజీవంగా వుంటుంది. క్రియాశీలంగా వుంటుంది. అవయవిలో అవయవం రూపాన్నీ (form) వ్యాపారాన్నీ (function) వివరించగలం కానీ విడదీయలేం. మొత్తం, భాగం వేరు. అవయవి, అవయవం వేరు. ఒక మర యంత్రంలో భాగంకానీ అవయవం కాదు. కాలు మనిషిలో అవయవం కానీ భాగం కాదు. యంత్రం నుంచి మరను వేరు చేయవచ్చును. అలా వేరు చేసినా అది మర స్వభావాన్ని కోల్పోదు. మనిషి నుంచి కాలు వేరుచేయవచ్చు- అంటే శరీరం నుంచి శస్త్రచికిత్స చేసి తీసివేయవచ్చును. కానీ అప్పుడు అది కాలు కాదు. కాలుగా వ్యాపారం చేసే శక్తిని అది కోల్పోతుంది. ఇతర అవయవాలకంటే భిన్నంగా వుండాలన్నా, ఇతర అవయవాల కంటే భిన్నమైన క్రియను నిర్వహించాలన్నా కాలు అవయవిలో అవయవంగా వుంటేనే సాధ్యం అవుతుంది. అవయవిలో అవయవంగా, అంగిలో అంగంగా లేకపోతే కాలుకి అస్తిత్వమే వుండదు. గతితార్కిక సాహిత్య భౌతికవాదం సాహిత్యాన్ని పునాదిలో ఉపరితలంలో ఒక భాగంగా పరిగణించదు. పునాది

ఉపరితలం కలసివుంటే అవయవిలో సాహిత్యాన్ని అవయవంగా పరిగణిస్తుంది. పునాది, ఉపరితలం అనే అవయవిలో అవయవంగానే సాహిత్యానికి అస్తిత్వం వుంటుంది. అప్పుడే సాహిత్యం సామాజిక పాత్ర నిర్వహించ గలుగుతుంది. సాహిత్య అస్తిత్వం, సాహిత్య వ్యాపారం అవయవిలో అవయవంగా వుంచేనే సాధ్యం అని గతితార్కిక భౌతికవాద సిద్ధాంతం కాదు, గతితార్కిక భౌతికవాదం ఆవిష్కరించిన సత్యం.

పునాదికి అనుగుణ్యంగా ఉపరితలం వుంటుంది. పునాది ఉపరితలానికి కారణం అనే వాదం తప్పు. ఒక కారణం ఒక కార్యం అనే ఏకైక కారణ వాదం, ఏకైక నిర్ణాయకవాదం గతితార్కిక భౌతికవాద విరుద్ధం. అంటే సాహిత్యం పునాదికి ఛాయా చిత్రంగా వుంటుందనే వాదం, ప్రత్యక్షంగా సాహిత్యం పునాదిచేత నిర్ణయింపబడుతుం దనే వాదం గతితార్కిక సాహిత్య భౌతికవాదం అంగీకరించదు. ఒక కారణానికి అనేక కార్యాలు వుండవచ్చును. ఒక ఉపరితల అంశం మరొక ఉపరితల అంశానికి కారణం కావచ్చు. ఒక కారణం నుంచి పుట్టిన కార్యం మరొక దానికి కారణం కావచ్చును. ఉపరితలంలో రాజకీయాలు, తత్త్వశాస్త్రం, వ్యాకరణశాస్త్రం, మతం, తత్త్వశాస్త్రం సాహిత్యానికి కారణం కావచ్చును. అంతిమ కారణమైన పునాది సాహిత్యానికి ప్రత్యక్ష కారణం కానవసరంలేదు. అలాగే పునాదికీ ఉపరితలానికీ బాహ్య గతితార్కిక సంబంధం మాత్రమే వుంటుందనే వాదం కూడా శాస్త్ర విరుద్ధం. ఈ వాదం ఉపరితల అంశాలకి సాపేక్ష స్వతంత్ర ప్రతిపత్తిని అంగీకరిస్తుంది. వాస్తవానికి ఉత్పత్తి కూడా స్వతంత్రమైనది కాదు. భాషకీ ఉత్పత్తికీ సంబంధాన్ని పరిశీలిస్తే ఈ బాహ్యగత గతితార్కిక సంబంధవాదం లోపభూయిష్టం అని అవగాహన చేసుకో వచ్చును. "స్పష్టంగా మానవుడు రాజకీయ జంతువు. కేవలం మందలో, గుంపులో జంతువు కాదు. సమాజంలో మాత్రమే వ్యక్తిగా రూపొందగల జంతువు. ఒకరితో ఒకరు మాట్లాడుకుంటూ అన్యోన్యతతో కలసి జీవించే వ్యక్తులు లేకుండా భాష అభివృద్ధి పొందటం ఎంత అసాధ్యమో, సమాజంతో సంబంధం లేకుండా ఏకాకిగా వుంటే వ్యక్తి వుత్పత్తి చేయటం అంతే అసాధ్యం" 1 కాబట్టి పునాది అంటే వుత్పత్తి భాష ఈ రెండింటినీ సాధించే సమాజం కూడా స్వతంత్రమైనవి కావు. భాష లేకుండా సాహిత్యం వుండదు. రచయితలు సాహిత్యాన్ని అవయవిలో అవయవంగా రచన చేయగలరు. చెప్పగలరు. రచయిత సమాజంలో ఇతరవ్యక్తులతో అన్యోన్య సంబంధం వల్లనే వ్యక్తి అవుతాడు. రచయిత అవుతాడు. సమాజానికి సంబంధం

లేకుండా మనిషి వ్యక్తి కాలేడు. ఏకాకిగా వుత్పత్తి చేయలేడు. భాషతో వ్యవహరించ లేడు. కవిత్వం చెప్ప లేడు. రచన చేయలేడు.

"మనిషి సమాజంలో మాత్రమే మనిషి అవుతాడు. అతని వ్యక్తిత్వం సమాజంలో మాత్రమే సామాజిక పరిస్థితులకి అనుగుణ్యంగానే వ్యక్తం అవుతుంది"[2]

రచన రచయిత వ్యక్తిగా మాత్రమే చేసే కార్యంగా స్థూలంగా కనిపిస్తుంది. కానీ వ్యక్తి రచయిత కావటానికి, రచన చేయటానికి సామాజిక జీవితం కారణం. రచనలో సామాజిక పరిస్థితులు, రచనకి కారణమైన సామాజికత ప్రచ్ఛన్నంగావుంటుంది. మనిషి మనిషి కావాలంటే సమాజంతోబాటు సమాజంలో ఇతర వ్యక్తుల్తో సంబంధంలో వుండ గల సముచిత శారీరక నిర్మాణం కూడా వుండాలి. మనిషి అంతర శారీరక క్రియాల్ని క్రియబద్ధం చేయటమే కాక బాహ్యప్రపంచంతో, సమాజంలోని ఇతరుల్తో సంబంధాన్ని నాడీ మండలం క్రియబద్ధం చేస్తుంది. ఇది మనిషిలో పదార్థ అంశం. మెదడు పదార్థం, దాని వ్యాపారమైన మనస్సు చైతన్యం. మనిషి మెదడు, మనిషి జీవించే సమాజం రెండూ వుంటేనే మనిషికి చైతన్యం అర్థవంతమైనదిగా, వుత్పాదక శక్తి కలిగిందిగా వుంటుంది. ఆవేశం, పారవశ్యం కూడా సముచిత శరీర నిర్మాణం గల మనిషిలోని మెదడూ, అతడు వ్యక్తిగా రూపొందిన సమాజం లేకుండా సాధ్యంకావు. గతితార్కిక సాహిత్య భౌతికవాదం సాహిత్యాన్ని పదార్థ మూలకంగానూ, సామాజిక ఉత్పత్తిగానూ భావిస్తుంది. మనిషి ప్రకృతితో వ్యవహరించే టప్పుడు కూడా ఇతర వ్యక్తులతో కలసి సమాజంలో రూపొందిన వ్యక్తిత్వంతోనే వ్యవహరిస్తాడు. రచనలో కనిపించే ప్రకృతి కూడా సామాజిక సంబంధాల నుంచీ రూపొందిన రచయిత సామాజికతకి ప్రతిబింబమే. ఇతర ఉత్పత్తులు ఏవిధంగా వ్యక్తి ఇతర వ్యక్తుల్తో సంబంధం లేకుండా తనకు తానుగా మాత్రమే చేయలేదో అలాగే రచయిత తన సమాజంలోని పునాదితో ఉపరితలంతో సంబంధం లేకుండా రచనని ఉత్పత్తి చేయలేడు. కాబట్టి పునాదికీ ఉపరితలానికీ బాహ్య గతితర్కం మాత్రమే వుంటుందనే వాదం కూడా తప్పు. పునాదికీ ఉపరితలానికీ అంతరగతితర్కం వుంటుంది. అంటే పునాది, ఉపరితలంలో ఏదీ స్వతంత్రంగా ఉండదు. అవయవిలోని అవయవాలు నిర్దిష్ట సామాజిక వ్యవస్థలో అన్యోన్య సంబంధంలో వుంటాయి. వీటికి అన్యోన్య క్రియ ఉండటమే కాదు, అన్యోన్యక్రియవల్ల వీటిలో పరిమాణాత్మక, గుణాత్మక మార్పులు వస్తాయి. ఒక అవయవంలో పరిమాణాత్మక మార్పులు వస్తూవుంటే మరొక అవయవంలో గుణాత్మక మార్పు పరిమాణాత్మక మార్పును పొందుతుంటుంది. పరిమాణ,

గుణాత్మక మార్పులు ఏ ఒక్క అవయవంలోనూ ఆ అవయవంలోని అంతర గతితర్కంవల్ల రాదు. పునాది - వుపరితలంలోని అన్నింటి అంతర గతితర్కంవల్ల మాత్రమే వస్తాయి. సాహిత్యంలో వచ్చే మార్పుల్ని సాహిత్యంలో వస్తుశిల్పాల చరిత్రలో వచ్చే మార్పులుగా పరిగణించటం సరియైందికాదు. సాహిత్యంలో మార్పులు ఇతర ఉపరితలం అంశాల్తో పునాదితో వుండే అంతర గతితర్కంవల్ల సంభవిస్తాయి. సమాజం అంటే అన్యోన్య ఆశ్రితాల మొత్తం. విభిన్న భాగాల మొత్తంకాదు. ప్రతి అంశం ఆ అంశంగా వుండటానికి ఇతర అంశాల్తో దాని సంబంధాలూ మొత్తంతో దాని సంబంధాలూ కారణం. సాహిత్యం సాహిత్యంగా వుండటానికీ అవయవిలో అవయవం కావటమే కారణం. సాహిత్యానికి ప్రత్యేకమైన సామాజికపాత్ర వుండటానికి అది అవయవంగా వుండటమే కారణం. మనిషికాలు కాలురూపంలో వుండటానికీ, కాలుగా నడవటం అనే క్రియను నిర్వహించటానికీ అది అవయవిలో అవయవంగా వుండటమే కారణం. కాలుకి స్వతంత్ర ప్రతిపత్తి వున్నదనుకోవటం ఎంత అశాస్త్రీయమో సాహిత్యానికి స్వతంత్ర ప్రతిపత్తి వున్న దనుకోవడం అంతే అశాస్త్రీయం. కాబట్టి పునాది వుపరితలానికి ఏకైక కారణం అనే వాదంకానీ, పునాదికీ వుపరితలానికీ బాహ్య గతితార్కిక సంబంధం వుంటుందనే వాదంకానీ తప్పుడువాదాలు. పునాది, వుపరితలం ఒక అవయవి. అన్నీ అవయవాలే అనే అంతర గతితార్కికవాదం మాత్రమే శాస్త్రీయమైనది. ఈ దృష్టినుంచీ సాహిత్యాన్ని పరిశీలించటం గతితార్కిక సాహిత్య భౌతికవాదం. గతితార్కిక భౌతికవాద తత్త్వ శాస్త్రానికి సంబంధించిందనీ, చారిత్రిక భౌతికవాదం సామాజిక పురోగమన శాస్త్రానికి సంబంధించిందనీ చాలా మంది భ్రమపడుతుంటారు. ప్రకృతి పరిణామాల్నీ, సామాజిక ఆర్థికరూపాల్నీ, వుపరితల అంశాల్నీ అన్నిటినీ గతితార్కికంగానూ, చారిత్రికంగానూ భౌతికవాదం దృక్కోణం నుంచీ పరిశీలించవలసిందే. చారిత్రిక దృష్టిలేని గతితార్కిక దృష్టికానీ గతితార్కిక దృష్టిలేని చారిత్రిక దృష్టికానీ వస్తు క్రమాల పరిశీలనకు ప్రమాణం కాజాలదు. అవయవిలో అవయవంగా సాహిత్యాన్ని గతితార్కికంగా, చారిత్రికంగా అధ్యయనం చేయటం గతితార్కిక సాహిత్య భౌతిక వాదం. గతితార్కిక భౌతికవాద మూలసూత్రాల్ని పునాది, ఉపరితల అంశాలకి అన్వయం చేయటాన్ని కొంతమంది యాంత్రిక భౌతికవాదం అంటున్నారు. వీళ్ళు ఏ అర్థంలో ఈ మాటను వాడుతున్నారో తెలీదు. యాంత్రిక భౌతికవాదం ఫ్యూడల్ భావవాద, ఆధ్యాత్మికవాద దృక్పథాలమీద తిరుగుబాటు చేసిన బూర్జువావర్గ ప్రాపంచిక దృక్పథం. కొత్తపుట్టటానికీ, అభివృద్ధిపొందటానికి యాంత్రిక భౌతికవాదం

వివరణలు ఇవ్వలేదు. సామాజిక అభివృద్ధి విశ్లేషించటంలో ఇది పూర్తిగా విఫలం అయింది. గతితార్కిక దృష్టిలేకుండా భౌతికవాద సూత్రాల్ని అన్వయం చేస్తే యాంత్రిక భౌతికవాదం అనవచ్చును. యాంత్రిక భౌతికవాదం ఊహాజనిత భౌతిక వాదం. మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, మావోల వంటి గతితార్కిక భౌతికవాదులు విప్లవకార్యాచరణ నుంచీ, వర్గపోరాట అనుభవం నుంచీ విజ్ఞానశాస్త్ర ఆవిష్కరణల నుంచీ రూపొందించిన సూత్రాలను అన్వయించటాన్ని యాంత్రిక భౌతికవాదం అనటం అర్థరహితం. మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, మావోలు అనేక సందర్భాల్లో ప్రకటించిన సాహిత్యాభిప్రాయాల్ని గతితార్కిక సాహిత్య భౌతికవాదానికి ప్రమాణాలుగా గ్రహించరాదు. సాహిత్యం మీద వాళ్ళు ప్రకటించిన అభిప్రాయాల్ని కూడా గతితార్కిక భౌతికవాద దృక్పథం నుంచి పరిశీలించి శాస్త్ర ప్రతిష్ఠ ఉన్న వాటినే స్వీకరించాలి. మార్క్స్ ఎంగెల్స్ లెనిన్ మావోలు సాహిత్యం మీద అనేక సందర్భాల్లో రాసిన వాటి ఒక సంకలనంగా చేర్చి అదే గతితార్కిక సాహిత్య భౌతికవాదానికి ప్రమాణంగా అంగీకరించటం అది భౌతికవాదం అవుతుంది. లేక పోతే రివిజనిజం అవుతుంది, కాని గతితార్కిక భౌతికవాదం కాదు.

సాహిత్యాన్ని నిర్దిష్టంగా (Concrete) చారిత్రిక దృష్టితోనూ, గతితార్కిక దృష్టితోనూ పరిశీలన చేయటం సాహిత్య గతితార్కిక భౌతికవాదం. అవయవి నుంచీ విడదీసి అవయవాన్ని మాత్రమే పరిశీలించటం, ఆ అవయవానికి సంబంధించిన భావాల్ని మాత్రమే విడిగా భావించటం అనిర్దిష్ట (abstract) పరిశీలన అంటారు. పునాది నుంచీ ఉపరితలాన్ని విడదీసి, ఉపరితలం నుంచి సాహిత్యాన్ని విడదీసి ఆ సాహిత్యాన్ని గురించి ఆలోచించటం అనిర్దిష్టం ఈ అనిర్దిష్ట సాహిత్యవాదం సాహిత్యాన్ని సమాజానికి సంబంధంలేని విషయంగా పరిగణిస్తుంది. నిర్దిష్ట సాహిత్యవాదం సాహిత్యాన్ని ఒక నిర్దిష్ట సామాజిక వ్యవస్థలో ప్రారంభమై వృద్ధి పొంది ఆవ్యవస్థతో బాటు అదృశ్యంఅయ్యే సమాజానికి సంబంధించిన సాహిత్యంగా పరిగణిస్తుంది. గతితార్కిక సాహిత్య భౌతికవాదం సాహిత్యాన్ని నిర్దిష్ట అవయవిలో నిర్దిష్ట భాగంగానే పరిశీలిస్తుంది. సాహిత్య సార్వత్రిక వాదాన్ని (literature in general) అంగీకరించదు. సామాజిక మూలాలులేని సార్వత్రిక మానవుడు వుండనట్టే సార్వత్రిక సాహిత్యం కూడా వుండదు. చారిత్రిక పద్ధతి అంటే కాలక్రమ చారిత్రిక పద్ధతి (historical – chronological method) కాదు. తార్కిక చారిత్రిక పద్ధతి. (logical-historical method) ప్రస్తుతం నుంచీ పునాది ఉపరితల, ఉపరితల విభిన్న అంశాల్ని తార్కికంగా పరిశీలించే పద్ధతి తార్కిక చారిత్రిక

పద్ధతి అంటారు. సాహిత్యాన్ని చారిత్రికంగా పరిశీలించటం గతితార్కిక సాహిత్య భౌతిక వాదంకాదు. అసలు చరిత్రనే విప్లవాత్మకంగా అర్థం చేసుకోవటం, ఆ విప్లవ అవగాహనలో అవయవంగా సాహిత్యాన్ని పరిశీలించటం గతితార్కిక సాహిత్య భౌతికవాదం. సాహిత్యం ఎప్పుడయినా చలన మార్పు సూత్రాలకి అధీనంగా ఉంటే నిర్దిష్ట సామాజిక వ్యవస్థకి సంబంధించిన నిర్దిష్ట సాహిత్యంగానే వుంటుంది. సాహిత్య సార్వత్రికవాదం సాహిత్యానికీ సమాజానికీ ఉంటే సంబంధాన్ని విశ్లేషించి అవగాహన చేసుకోవటంలో విఫలం అవుతుంది. సాహిత్యం సార్వకాలికం, సార్వజనీనం, విశ్వజనీనం అనే వాదాలు సాహిత్య అనిర్దిష్టవాద ఫలితాలే. ఈ వాదం సాహిత్యాన్ని శ్రోతల నుంచీ, పాఠకుల నుంచీ, శ్రోతల్నీ, పాఠకుల్నీ సాహిత్యం నుంచీ వేరు చేస్తుంది. అన్ని యుగాలకీ, మానవులందరికీ, అన్ని పరిస్థితులకీ అన్వయించే సూత్రాలు ఎన్నడూ, ఎక్కడా ఎవరికీ అన్వయించని సూత్రాలు. సార్వకాలిక సార్వజనీన సాహిత్యం ఉండదు. వర్గసమాజం తొలిదశల్లో సాహిత్యాని సార్వకాలిక, సార్వజనీన, విశ్వజనీన సాహిత్యంగా పరగణించే సాహిత్య అనిర్దిష్టవాదులు చాలా మంది ఉన్నారు. గతితార్కిక సాహిత్య భౌతికవాదం ప్రాచీన సాహిత్యాన్ని శాస్త్రీయంగా వివరించడంలో విఫలం అయిందని ఈ సాహిత్య అనిర్దిష్టవాదుల, సాహిత్య సార్వత్రిక వాదుల అభిప్రాయం. ప్రాచీన గ్రీకు సాహిత్యం ఆనాటి పునాదికి అనుగుణ్యంగా లేదు. ఇప్పటికీ ఆ సాహిత్యాన్ని చదివి ఆనందిస్తున్నాం. ఒక నిర్దిష్ట సామాజికదశను కాక ప్రపంచంలో ఉన్న అందరి జీవితానికి ఆ సాహిత్యం ప్రతిబింబంగా ఉంది. ప్రాచీన గ్రీకు సాహిత్యం అపరిణత సమాజ ఉత్పత్తి మానవజాతి బాల్యదశకి సంబంధించిన సాహిత్యం. ఆనాటి ఉత్పత్తి శక్తులు వెనకబడి ఉన్నప్పటికీ ఉన్నత సాహిత్యం ఉత్పన్నం కాలేదు. ఆ సాహిత్యానికి ఉత్పత్తిశక్తులు వెనకబడి ఉండటమే కారణం. ఆ సమాన బాల్యదశ పునరావృత్తం కానట్టే ఆ సాహిత్యం కూడా పునరావృత్తంకాదు. కాబట్టి సాహిత్యం సార్వకాలికం అని నిరూపించటానికి గ్రీకు సాహిత్యం ప్రమాణంకాదు. అలాగే ఆనాటి గ్రీకు సాహిత్యంలో గ్రీకుల సామాజిక, ప్రాకృతిక సంబంధాలే ఉన్నాయికానీ భారతీయ, ఈజిప్టు సమాజాల జీవితంలేదు. కాబట్టి సాహిత్యం విశ్వజనీనం అనటానికి గ్రీకు సాహిత్యం ప్రమాణంకాదు. గ్రీకు సాహిత్యాన్ని ఇప్పటికీ చదివి ఆనందించడానికి దానిలో పసిపిల్లలలోని ఆకర్షణ ఉండటమే కారణం. కాబట్టి సాహిత్య సార్వజనీనతకి కూడా గ్రీకు సాహిత్యం ప్రమాణంకాదు. ఒక వర్గం స్థానంలో మరొక వర్గం రాజకీయ అధికారంలోకి వచ్చినదశల్లోని సాహిత్యం అప్రియత్నంగా వాస్తవికతని

చిత్రించగలుగుతుంది. అవయవిలో వచ్చిన గుణాత్మక మార్పును ఒక అవయవంగా సాహిత్యం ప్రతిబింబించే సమయాల్లో వచ్చిన సాహిత్యంలో కూడా ఉన్నత విలువలు వుంటాయి. గతితార్కిక సాహిత్య భౌతికవాదం పరిమాణం గుణంగా గుణం పరిమాణంగా మారటం, వ్యతిరేకాలమధ్య ఘర్షణ, అభావం అభావం కావటమనే శాస్త్రీయ సూత్రాలతో ఆదిమ సాహిత్యాన్ని గతసాహిత్యాన్ని అవయవిలో అవయవంగా పరిశీలిస్తుంది. అది సార్వకాలిక, విశ్వజనీన, సార్వజనీన సిద్ధాంతాల్ని అంగీకరించదు. ప్రాచీన సాహిత్యం సాహిత్యం కాదు సాహిత్య చరిత్ర, చరిత్ర. ఈనాడు ప్రాచీన సాహిత్యానికి చారిత్రిక పాత్ర మాత్రమే వుంటుంది. సామాజిక పాత్ర వుండదు. సాహిత్య సామాజిక పాత్ర ఆ సాహిత్య సంబంధమైన సామాజిక వ్యవస్థతో పాటే అదృశ్యం అవుతుంది.

గతితార్కిక సాహిత్య భౌతికవాదం సాహిత్యానికి స్వతంత్ర ప్రతిపత్తి వుంది అనే తప్పుడు చైతన్యాన్ని నిరాకరిస్తుంది. సాహిత్యం వస్తు శిల్పాలకి, కవి బృందానికి సంబంధించిన నిర్జీవ అంశంగా వుండదు. సమాజంలో పాలకవర్గ అధికారం న్యాయమైనదనీ, సమంజసమైనదనీ, ధర్మబద్ధమైనదనీ, శాశ్వతమనీ ఈ తప్పుడు చైతన్యంతో కూడిన సాహిత్యం భావజాల పాత్ర నిర్వహిస్తుంది. సాహిత్యం సకల పాప వినాశిని అని ఫలశృతిచెపుతుంది. ఆనంద నిశ్చల నృత్యం సాహిత్య ప్రయోజనమని భావించటం జరుగుతుంది. అవయవితో సంబంధం లేకుండా వస్తురూపాల (content and form) చర్చకు పూనుకోవటం తప్పుడు చైతన్య ఫలితమే. సాహిత్యంలో వస్తువు ముఖ్యమా? శిల్పం ముఖ్యమా? అనే వాదం అనిర్దిష్ట ప్రయోజన శూన్యవాదం. అధికారవర్గం ఉత్పత్తి చేసిన పలాయనవాద ముఠాలోని అల్పబుద్ధుల అశాస్త్రీయవాదం. సాహిత్యం అంటున్నాం అంటేనే రూపం వుంటుందని అంగీకరిస్తున్నాం. రూపం లేకుండా సాహిత్యం వుండదు. కాలు రూపం లేకుండా వుంటుందా? రూపం లేకపోతే కాలు నడిచే క్రియను నిర్వహించలేదు. ఏదైనా రోగంవచ్చి కాలు నడిచే శక్తిని కోల్పోయి కాలు రూపం మాత్రం మిగిలితే కాలు వున్నట్టా లేనట్టా? వుండిలేనట్టు. రూప మాత్రంగా మిగిలిపోయిన కాలు చూసేవాళ్ళకి కాలు అనే భ్రమని కలిగిస్తుంది. నడిచే క్రియాశక్తి లేనప్పుడు రూపం మిగిలివున్నా అది సారాంశంలో కాలు కాదు. అలాగే సాహిత్యం రూపంవల్లనే సాహిత్యంగా పిలువబడుతున్నా వస్తువు లేకపోతే సాహిత్యం అనే భ్రమని కలిగించగలదే తప్ప అది సాహిత్యం కాదు. సాహిత్యంలో వాస్తవమైన సామాజిక అంశం రూపమే. అయితే రూపం వస్తువునుంచే పుడుతుంది. తిరిగి వస్తువుమీద ప్రభావం చేస్తుంది. వడ్రంగి చెక్కను తన సాధనాంతో పలకం

ప్రకారం రూపం ఇస్తూ చివరికి కూర్చోవటానికి అనుగుణ్యంగా వుండే కుర్చీ తయారు చేస్తాడు. కూర్చోవటానికి అనుగుణ్యమైన రూపం లేకపోతే దాన్ని కుర్చీ అని పిలవం. అయినా ఆ రూపం చెక్క అనే వస్తువు నుంచే పుడుతోంది. కుర్చీ అనే రూపం వడ్రంగి దృష్టిలో వుండటంవల్ల ఆ రూప ప్రభావంతో వస్తువు కుర్చీ రూపాన్ని పొందుతుంది. అలాగే సాహిత్యంలో రూపం వస్తువు నుంచే పుట్టి రచయిత భాషా సాధనాల్తో, రచయిత సామాజిక వ్యవస్థ అనే అవయవితో పొందిన అనుభవం నుంచీ, వర్గ పోరాటంలో రచయిత పాత్ర నుంచీ రూపం వస్తువుమీద ప్రభావం చేస్తుంది.

“రూపం దాని వస్తువుకి రూపం కానప్పుడు రూపానికి ఏమీ విలువ వుండదు”[3] (మార్క్స్). రూపాలు కవులు వ్యక్తిగతంగా సాధించేవి కావు. చారిత్రికంగా, గతితార్కికంగా వస్తువునుబట్టే రూపాలు నిర్ణీతం అవుతాయి. వస్తువు మారుతూ వుండే రూపాలు మారతాయి, పరివర్తన చెందుతాయి, నాశనం అవుతాయి, విప్లవ స్వభావాన్ని పొందుతాయి. సాహిత్యంలో రూపం వస్తువూ సాహిత్యం అవయవిలో అవయవంగా వుండటం వల్లనే సాధ్యం అవుతాయి. అవయవి నుంచీ విడదీసి అంటే పునాది ఇతర ఉపరితల అంశాల నుంచీ విడదీసి సాహిత్యంలో వస్తురూపాల చర్చ చేయటం గతితార్కిక సాహిత్య భౌతికవాద విరుద్ధం. సాహిత్యంలో వస్తురూపాల్లోని మార్పులకి సాహిత్యమే కారణమని భావించటం తప్పుడు చైతన్య ఫలితమే. ఉత్పత్తి, భాష, రాజకీయాలు, మతం, న్యాయశాస్త్రం, తత్త్వశాస్త్రం మొత్తం అవయవిలోనే సాహిత్యంలో రూపాలు ఉత్పన్నం అవుతాయి. కాబట్టే చరిత్రలో చాలా తక్కువ రూపాలు వున్నాయి. సాహిత్యంలో వస్తురూపాలు పునాది, ఇతర ఉపరితల అంశాల్తో అంతర గతితర్కం వల్లనే ఏర్పడతాయి.

గతితార్కిక సాహిత్య భౌతికవాదం సాహిత్యాన్ని నిర్దిష్ట సామాజిక వ్యవస్థ అనే అవయవిలో అవయవంగా పరిగణిస్తుంది కాబట్టి రచన ఆచరణ కూడా అవుతుంది. ప్రాపంచిక తత్త్వశాస్త్రం కేవలం ప్రాపంచిక తత్త్వశాస్త్రంగా వుండిపోదు. అది ఆచరణగా మారుతుంది. సిద్ధాంతం ఆచరణగా మారే చారిత్రిక సందర్భంలో రచనలో సామాజిక వాస్తవిక చిత్రణ గతి తార్కిక దృక్పథం లేకుండా సాధ్యం కాదు. సాహిత్యం సామాజికమైన నిర్దిష్టమైన వాస్తవ వర్గ పోరాటంతో అన్వయం వున్నప్పుడే ఆచరణ అవుతుంది. వుత్పత్తి శక్తులకీ, వుత్పత్తి సంబంధాలకీ మధ్య గతితార్కిక ఘర్షణ అస్తిత్వానికీ, ఆలోచనకీ మధ్య, వాస్తవానికీ ఆదర్శానికీ మధ్య, సాధించినదానికీ ఆశకీ మధ్య గతితార్కిక ఘర్షణగా దారితీస్తుంది. ఈ స్థితిలో

కొందరు రచయితలు ప్రాక్తన చారిత్రిక దశను ఆదర్శీకరించ వచ్చును. కొందరు మత విశ్వాసాల్లోకి పలాయనం చేయవచ్చును. కొందరు విప్లవంలో మమేకం అయి ఆచరణలోకి దిగవచ్చును. విప్లవ సాహిత్యం ఆచరణ. మిగిలిన సాహిత్యం భావస్థాయిలో, సిద్ధాంతస్థాయిలో వుండిపోయి సామాజిక విప్లవంలో ప్రజల శక్తిగా పనిచేయలేదు. విప్లవ వర్గ సాహిత్యంగా వున్నప్పుడే గతితార్కిక సాహిత్య భౌతిక దర్శనంతో వున్న సాహిత్యం ఆచరణ అవుతుంది. ప్రజా పోరాటాల్తో సామాజిక వాస్తవ శక్తుల గమనంతో సంబంధంవున్న రచననే ఆచరణ అంటారు. ఒక ధోరణిగా, ఒక ఉద్యమంగా వుండేది మాత్రమే కాక ఒక నిర్మాణాత్మక సంఘటిత కార్యాచరణతో అన్వయంగల సాహిత్య కృషినీ ఆచరణ అంటారు. రచన ప్రతిదీ ఆచరణలో భాగం కాదు. భౌతిక శక్తిగా మారగల రచన మాత్రమే ఆచరణ. సమాజంలో వర్గాలు కేవలం ఆర్థికమైనవీ కావు, సామాజికమైనవీ కావు- రాజకీయమైనవి. సాహిత్యం ప్రజలమీద పట్టు సంపాదించగలిగినప్పుడు విప్లవ కార్యాచరణగా మారి భౌతిక శక్తి అవుతుంది. గతితార్కిక సాహిత్య భౌతికవాదమే భౌతికశక్తిగా మారగలుగుతుంది.

"మౌలికంగా వుండటం అంటే వస్తువుల్ని మూలం నుంచీ అవగాహన చేసుకోవాలి. మనిషికి ఆ మూలం మనిషే. మనిషిని నీచుడుగా, బానిసగా, బహిష్కృతునిగా తిరస్కృతునిగా చేసే పరిస్థితుల్ని నాశనం చేయటం విధిగా నిర్వర్తించవలసిన ముఖ్య కర్తవ్యం. మౌలిక విప్లవం మౌలిక కర్తవ్యాల విప్లవంగానే వుంటుంది"[4] (మార్క్స్).

సాహిత్యం మనుషుల్ని అవగాహన చేసుకోవటమే కాకుండా, వర్గసమాజాన్ని మార్చటానికి మౌలికావసరాల్ని ప్రతిబింబించాలి. వర్గం అనేది ఆర్థిక, సామాజిక ఐక్య రూపంగా వుంటుంది. వర్గాలు ఉత్పత్తికి సంబంధించిన అంశాలు. వర్గాలు మొత్తం మానవ సామాజిక శ్రమ రాజకీయ ప్రతినిధులు. వర్గ సమాజంలో వర్గ సాహిత్యం వుంటుంది. గతితార్కిక సాహిత్య భౌతికవాది వర్గ పోరాటాన్ని క్షణం విస్మరించడు. "వర్గపోరాటాన్ని ఎన్నడూ విస్మరించకు"[5] గతితార్కిక సాహిత్య భౌతికవాదం సాహిత్యాన్ని వర్గపోరాట ఆయుధంగా భావిస్తుంది. గతితార్కిక భౌతికవాది విప్లవ వర్గమైన కార్మికవర్గంతో మమేకం పొందుతాడు. కార్మికవర్గం మౌలిక కర్తవ్యాల్ని నిర్వహించే మౌలిక విప్లవానికి నాయకత్వం వహించగలదు. కార్మికవర్గానికి సంప్రదాయిక ప్రతిష్ఠ కాక మానవతా ప్రతిష్ఠ మాత్రమే వుంటుంది. మొత్తం మానవ జాతిని విముక్తి చేయగలుగుతుంది. గతితార్కిక భౌతికవాద ప్రాపంచిక దృక్పథం వున్న రచయితలు కార్మికవర్గ విప్లవంలో క్రియాశీల పాత్రని నిర్వహించగలుగుతారు. అవయవిలో గుణాత్మకమైన మార్పు, వైరుధ్యాల ఘర్షణ అన్ని అవయవాల్లోనూ వ్యాపించినా ఆ మార్పుకోసం జరిగే పోరాటం అనివార్యంగా రాజకీయ రూపం తీసుకుంటుంది. తన రాజకీయ అభిప్రాయాలకి భిన్నంగా వ్యతిరేకంగా ప్రపంచాన్ని లోతుగా అర్థంచేసుకోవటం గతితార్కిక సాహిత్య భౌతికవాదికి అసం

భవం. అన్ని రంగాల్లోని పోరాటానికి ఆధిపత్యస్థానంలో వుండేది రాజకీయ అధికారం చేసే పోరాటమే. అవయవిలోని అవయవాలన్నీ రాజకీయ అధికారం కోసం చేసే పోరాటంలో కార్మికవర్గానికి సుముఖంగా మారిపోతుంది. "రాజకీయ అధికారంకోసం పోరాటం చెయ్యటం కార్మికవర్గ మహత్తర కర్తవ్యం"[6] (మార్క్స్). కార్మికవర్గ విప్లవ రాజకీయ ఆధిపత్యంలో సాహిత్యం కూడా విప్లవ కార్యాచరణ అవుతుంది. ఈ ఆచరణ కూడా పునాది, ఉపరితలాల అన్యోన్య క్రియవల్లనే సాధ్యం అవుతుంది. సిద్ధాంత రంగానికి సంబంధించిందిగా కనిపించే సాహిత్యం ప్రజల విప్లవ ఆచరణతో అన్వయం పొందినప్పుడు భౌతిక శక్తిగా మారుతుంది. భౌతిక శక్తిని భౌతిక శక్తి ద్వారానే కూలదోయటం సాధ్యం అవుతుంది. సాహిత్యం భౌతిక శక్తిగా మారటం అవయవిలో అవయవంగా విప్లవకరంగా పరిణతి చెందినప్పుడే జరుగుతుంది.

"పాలక వర్గాన్ని మరొక మార్గం ద్వారా కూలదోయలేకపోవటం వల్ల మాత్రమే విప్లవం అవశ్యం కావటంలేదు. విప్లవంతో పాలక వర్గాన్ని కూలదోసిన వర్గం మాత్రమే యుగయుగాల నుంచీ సంక్రమించిన బురద నుంచి విముక్తం కాగలదు. సమాజాన్ని నూతనంగా నిర్మించే శక్తిని పొందగలుగుతుంది"[7] (మార్క్స్). సాహిత్యం అధికార వర్గాల వుక్కు పంజరం నుంచీ, సంప్రదాయిక భ్రమల నుంచీ విముక్తిని పొంది నూతన సమాజవ్యవస్థలో అవయం కావటానికి విప్లవ వర్గంతో మమేకం చెందుతుంది. గతితార్కిక సాహిత్య భౌతికవాదం సాహిత్యాన్ని ఆచరణగా మార్చగలుగుతుంది.

గతితార్కిక భౌతికవాద సాహిత్య విమర్శ కేవలం సాహిత్యానికే పరిమితమైన విమర్శగా వుండదు. సాహిత్యం నిర్దిష్ట సామాజిక వ్యవస్థకి చెందిందిగా వుంటుంది కాబట్టి సాహిత్య విమర్శ సమాజ విమర్శగానే వుంటుంది. సాహిత్యాన్ని ఒక అవయవిలో అవయవంగా భావించి మొత్తం అవయవిమీద విమర్శ చేయటం గతితార్కిక సాహిత్య భౌతికవాద విమర్శ అవుతుంది. గతితార్కిక సాహిత్య విమర్శ కేవలం విమర్శ కాదు, విప్లవం. సాహిత్యాన్ని సాహిత్యానికే పరిమితంగా చేసి విమర్శించటం మొత్తం సంస్కృతిలో, జీవితంలో సాహిత్యపాత్రని నిరాకరించటమే. విప్లవదృష్టి లేని కేవల విమర్శ సాహిత్య యథాతథవాదం అవుతుంది. సాహిత్య పరిశోధన, సాహిత్య తత్త్వం, సాహిత్య చరిత్ర, సాహిత్య విమర్శలకి సమాన లక్షణాలు వున్నా వాటి ప్రయోజనాలు, పరిమితులూ వేరు. సాహిత్య పరిశోధన సాధారణంగా ప్రాచీన సాహిత్యాన్ని అనాటి అవయవిలో అవయవంగా బహుముఖ పరిశోధన చేస్తుంది. సాహిత్య విమర్శ కేవలం వర్తమాన సాహిత్యానికి సంబంధించి వుంటుంది. పరిశోధకుడికీ, విమర్శకుడికీ చారిత్రకదృష్టి తాత్త్వికదృష్టి అవసరమే. విమర్శ కవుల్నీ రచయితల్నీ శాస్త్రీయమైన, సామాజికమైన వున్నత ఆశయాలవైపు చైతన్యవంతం చేస్తుంది. ప్రజావ్యతిరేక, మానవతా వ్యతిరేక సాహిత్యంలో

నీచాభిరుచుల్ని ఎత్తిచూపుతూ సాహిత్యాన్ని ప్రజాపరం చేసే కర్తవ్యాన్ని విమర్శ నిర్వహిస్తుంది. ఇది బతికివుండి రాస్తున్న రచయితల విషయంలో సాధ్యం అవుతుంది కానీ చచ్చిపోయిన కవుల విషయంలో సాధ్యం కాదు. శ్రీశ్రీలో అశాస్త్రీయ అవగాహన ఏమన్నా వుంటే విమర్శకుడు సవరించే ప్రయత్నం చేయవచ్చును. గురజాడను సవరించలేం. ఆయన ఇప్పుడు లేకపోవటమే దీనికి కారణం. కాబట్టి గతితార్కిక భౌతికవాద సాహిత్య విమర్శ వర్తమాన సాహిత్యాన్ని విప్లవంకోసం విమర్శిస్తుంది. సాహిత్యంలాగా సాహిత్య విమర్శ కూడా అవయవిలో అవయవంగానే వుంటుంది. సాహిత్య విమర్శలో పరిభాష దాదాపు అంతా ఇతర శాస్త్రాల నుంచి గ్రహించినవిగానే వుంటాయి. పూర్వ సాహిత్యాన్ని పరిశోధించేటప్పుడు అనిర్దిష్ట సాహిత్యానికి ఆనాటి చారిత్రికార్థం, తర్వాతి తరాల చైతన్యంలో ఆ పూర్వ రచన పొందిన రూపాలనూ వివరించాలి.

గతితార్కిక సాహిత్య భౌతికవాద విమర్శకి విప్లవం లక్ష్యం కాబట్టి అది కఠినంగానూ కర్కశంగానూ వుంటుంది.

"అస్తిత్వంలో వున్న అన్నిటినీ కఠినంగా విమర్శించవలసిందే. విమర్శవల్ల సంభవించిన నిర్ధారణల విషయంలో నిర్భయంగా వుండటాన్ని, విమర్శవల్ల అధికార వర్గంతో వచ్చే సంఘర్షణ విషయంలో నిర్భయంగా వుండటాన్ని కఠినమైన విమర్శ అంటున్నాను"[8] (మార్క్స్). సాహిత్య విమర్శ వర్తమాన సాహిత్య విమర్శ అయినప్పుడు, వర్తమాన సాహిత్య విమర్శ వర్తమాన సమాజంలోని పాలక వర్గాన్ని, పాలకవర్గ భావజాలాన్ని విమర్శించటం అనివార్యం. గతితార్కిక సాహిత్య భౌతికవాద విమర్శ నుంచి చేసిన నిర్ధారణల్ని ప్రకటించటంలో, ప్రచారం చెయ్యటంలో నిర్భయంగా వ్యవహరించాలి. విమర్శను అణిచివేయటానికి అధికారవర్గ ప్రాపకం వున్న రచయితలు కానీ, ప్రభుత్వమే కానీ పూనుకోవచ్చును. వీళ్ళతో వచ్చే ఘర్షణలో కూడా నిర్భయంగా వుండాలి.

"విమర్శ మనస్సుకి సంబంధించిన తీవ్రావేశం కాదు. అది తీవ్రావేశానికి తలమానికం. విమర్శ వైద్యుని చేతుల్లోని శస్త్రచికిత్స చేసే సాధనం కాదు. పోరాటం చేసే విప్లవకారుని చేతిలో ఆయుధం."[9]

విమర్శ ఆయుధం కావాలి అంటే అది విమర్శ స్థాయిలోనే వుండిపోకూడదు. విమర్శ అనే ఆయుధం ఆయుధాల్తో విమర్శించే స్థానంలో ప్రత్యామ్నాయం కాలేదు. విమర్శ సాహిత్యాన్ని ప్రజల దగ్గరకు తీసుకుపోయినప్పుడు అది భౌతిక శక్తిగా మారుతుంది. అంటే ప్రజల విప్లవ కార్యాచరణకు కారణం అవుతుంది. అలా కావాలంటే సాహిత్య విమర్శ గతితార్కిక భౌతికవాద సాహిత్య విమర్శగా వుండాలి. అంటే విప్లవ వర్గమైన కార్మికవర్గ సాహిత్యంగా వుండాలి. సమాజంలో పరిణతమవుతున్న వైరుధ్యాల్ని సాహిత్యం ఎంత గాఢంగా ప్రతిబింబిస్తే అది అంతగా విప్లవ

సాహిత్యం అవుతుంది. అంతగా విప్లవ కార్యాచరణకి దోహదం చేస్తుంది. గతితార్కిక సాహిత్య భౌతికవాదం అనేక సాహిత్య కళా సిద్ధాంతాల్లో ఒకటి కాదు. పూర్వ సిద్ధాంతాలన్నిటినీ అభావం చేసిన శాస్త్రీయ సాహిత్య తత్త్వశాస్త్రం.

NOTES :

1. The human being is in the most literal sense a political animal, not merely a gregarious animal. but an animal, that can individuate itself only in society. Production by an isolated individual outside society... is as much as of an absurdity as is the development of language without individuals living together and talking to each other.
(Marx. Grundrisse (Nicolaus) Page 84)

2. Man can settle down only in society, only in society can his individuality bereve aled in accordance with the social conditions.
(Marx - Engels, From Early Works - Page 558)

3. Form is of no value unless it is the form of its content.
(Marx. Rheinism Leitung)

4. To be radical is to grasp things by the root. But for man the root is man himself... The categarical impreative is to overthrow all those conditions in which man is abased, contemptible being .. A radical revolution can only be a revolution of radicai needs. (Marx, Contribution of the critique of Hegel's Philosophy of Right- - Introduction)

5. Never forget class struggle.
(Mao - Philosophy is no mystery - Page 35)

6. To conquer political power has... become the great duty of the working class. (Marx - Capital I. Chapter X Page 440)

7. ... the revolution is necessary therefore, not only because the ruling class cannot be overthrown in any otherway, but also because the class overthrowing it can only in a revolution succeed in ridding itself of all the muck of ages and become fitted to found society anew.
(Marx - German Ideology, Collected Works Volume 5, Page 88)

8. I am referring to ruthless criticism of all that exists, ruthless both in the sense of not being afraid of the results it arrives at and in the sense of being just as little afraid of conflit with the powers that be. (Marx, Engels - Collected Works Volume 3, Page 142)

9. ...... "Criticism is no passion of the head, it is the head of passion. It is not a lancet, it is a weapon."
Marx - Quotedi "Birth of a Genius')
by Genrikh Volkou - Page 193'

# స్త్రీలను అవమానించే మాటలు వాడడం 'ప్రజాపంథా'యా?

రంగనాయకమ్మ

వరవరరావుగారు తన 'స్వేచ్ఛ' అనే కవితా సంకలనంలో 'కొజ్జా', 'రంకు' అనే పదాలు వాడడం గురించి 1978 జూన్ 'ప్రజాసాహితి' లో విమర్శించాను, వరవరరావుగారు 'ప్రజాసాహితి' విమర్శతో ఏకీభవించి, స్త్రీల ప్రత్యేక సంచికగా వచ్చిన 1979 నవంబరు 'సృజన' సంపాదకీయంలో ఆత్మవిమర్శ చేసుకున్నారు. ఆ ఆత్మవిమర్శ గురించి డిసెంబరు 'సృజన'లో కొన్ని ఉత్తరాలు వచ్చాయి. కొందరు పాఠకులు ఆ ఆత్మవిమర్శని అభినందించారు. ఒక విశాఖపట్నం పాఠకుడు వరవరరావుగారి ఆత్మవిమర్శని చాదస్తంగా కొట్టిపారేసి, బూతుపదాలు వాడడంలో తప్పులేదని వాదించారు. ఈ విశాఖ పాఠకుడు 'మార్క్సిస్టు' అని ఆయన ఉత్తరం చాలా స్పష్టంగా చెపుతోంది. ఈ మార్క్సిస్టు, వరవరరావుగారి ఆత్మవిమర్శని హేళన చేస్తూ, తన తర్కం కొంత చెప్పి, చివరగా "సంపాదకీయంలోని వాదంతో నేను కన్విన్స్ కాలేకపోతున్నాను" అన్నారు. అంతేగాక, "మనది మాస్‌లైన్ మరిచిపోవద్దు" అని కూడా హెచ్చరించారు. ఈ విశాఖ మార్క్సిస్టు వ్యక్తంచేసిన ప్రతీ ఒక్క అభిప్రాయమూ చెప్పలేనంత అశాస్త్రీయంగా వుంది.

మనం ఈ విషయాన్ని కనీసంగానైనా చర్చించాలంటే ముందు చాలా స్పష్టమైన ప్రశ్నలు కొన్ని వేసుకోవాలి— బూతు మాటలు ఎందుకు వాడకూడదు? ఎవరు వాడకూడదు? ఎలా వాడకూడదు? ఇంతవరకూ వున్న సమాజాలలో బూతు మాటలు ఎవరు వాడుతున్నారు? ఏ ఉద్దేశ్యాలతో వాడుతున్నారు?— వంటి ప్రశ్నలు కొన్నైనా చూడాలి. ఈ ప్రశ్నలకు జవాబులు చూసేముందు వరవరరావుగారు అసలా మాటలు ఏయే సందర్భాలలో వాడారో ఇక్కడ కోట్ చేస్తాను.

1. "మార్క్సిజం మాటల్లో వల్లించే కొజ్జాలు
   తాము లేవలేక
   జనం లేవలేదంటున్నారు" ('జాతీయ కోడి....' కవిత నించీ)

2. "వర్గ పోరాటం చుక్కానిగా నువ్వు నడిపిన శ్రామిక రాజ్యాన్ని
   వర్గ సామరస్యం ఊబిలో దించి
   సామ్రాజ్యవాద సహజీవన సంకర రాజకీయాల
   రంకు సాగిస్తున్నది రివిజనిజం ఇవ్వాళ" ('లెనినిజం' కవిత నించీ)

ఈ రెండు కవితల్లో అభిప్రాయాలనీ కవే డైరెక్టుగా చెప్తున్నాడు. ఏవో 'పాత్రలు' చెప్పడంలేదు.

* * *

రచనలో బూతుమాటలు వాడడం అనేది 2 రకాలుగా వుంటుంది.

1. కవి వాడడం
2. పాత్రలు వాడడం

* * *

కవే బూతు మాటలు వాడినప్పుడు— ఆ కవి ఎటువంటి భావాలు కలవాడు ?— అనే ప్రశ్న ప్రధానంగా వుంటుంది.

1. భూస్వామ్య భావాలూ, బూర్జువా భావాలూ గలవాడా ?
2. ప్రజాతంత్ర భావాలు గలవాడా ? (ప్రజాతంత్ర భావాలు అంటే, భూస్వామ్య విధానాన్నీ, సామ్రాజ్య వాదాన్నీ వ్యతిరేకించడం వరకూ మాత్రమే వుండే భావాలు.)
3. మార్క్సిస్టు భావాలు గలవాడా ?

* * *

రచనలోని 'పాత్ర' బూతు మాటల్ని వాడినప్పుడు— ఆ పాత్ర ఎటువంటి భావాలు గలది ? అనే ప్రశ్న ప్రధానం.

1. భూస్వామ్య భావాలూ, బూర్జువా భావాలూ గలదా ?
2. ప్రజాతంత్ర భావాలు గలదా ?
3. మార్క్సిస్టు భావాలు గలదా ?

* * *

దోపిడీ భావాలైనటువంటి భూస్వామ్య, బూర్జువా భావాలు గలిగిన (ఆ భావాల వల్ల ప్రభావితులై వున్న) స్త్రీ, పురుషులు బూతు మాటల్ని యధేచ్ఛగా వాడడం ఈ సమాజంలో జరుగుతూ వుంది. అలాంటి భావాలే కలిగిన కవి కూడా తన రచనల్లో బూతుమాటల్ని యధేచ్ఛగా దొర్లిస్తాడు. అతని రచనలోని, అదే రకం భావాలు గలిగిన పాత్రలచేత కూడా బూతుమాటలే వాడిస్తాడు— ఇది మనకు బాలా స్పష్టంగా తెలిసిన విషయమే.

ఫ్యూడల్ భావాలూ, బూర్జువా భావాలూ గలిగిన వాళ్ళు బూతు మాటల్ని వాడడంలో అర్థం ఏమిటి, ఆ బూతు మాటలకి అర్థం ఏమిటి— అని ఆలోచిస్తే, నూటికి తొంభై సందర్భాల్లో, తొంభై మాటల్లో స్త్రీలని అవమానించడమే ప్రధానంగా వుంటుందనడంలో సందేహంలేదు. కొన్ని మాటలు స్త్రీ పురుష శారీరక సంబంధాన్ని నీచపరుస్తాయి. కొన్ని మాటలు కేవలం స్త్రీ పురుష మర్మావయవాల్ని పలుకుతాయి— ఇలాంటి తేడాలు కొన్ని వున్నా 'బూతు మాటల్లో ఎక్కువ భాగం స్త్రీలని అవమానం చేసేవే' అనే ఖచ్చితమైన అభిప్రాయంతోటే నేనీ వ్యాసం ప్రారంభించాను. (నా అభిప్రాయం కరెక్టు కాదనే అభిప్రాయం ఎవరికైనా వుంటే దాన్ని గురించిన చర్చ వేరే సారి సాగించవచ్చు. ఇక్కడ మాత్రం, నా అభిప్రాయం ఏదో దాన్నే పాఠకులు దృష్టిలో పెట్టుకోవాలి.)

* * *

మార్క్సిస్టులు— సమాజ విముక్తిలో ఒక ప్రధాన భాగంగా స్త్రీల విముక్తిని కోరుతారు.

స్త్రీల విముక్తి అంటే స్త్రీలకు దేనినించి విముక్తి? పోషణకోసం పురుషుడి మీద ఆధారపడడం అనే ఒక్క 'ఆర్థిక దాస్యం' నించి మాత్రమేనా విముక్తి? లేక, స్త్రీలు రాజకీయాలలో పాల్గొన లేకపోవడమూ, దోపిడీ రాజకీయాలకు లొంగి వుండడమూ అనే 'రాజకీయ దాస్యం' నించి మాత్రమేనా విముక్తి? — పురుషుడి పెత్తనం నించీ, 'తిట్ల' రూపంలోనూ, కొట్టడం రూపంలోనూ పురుషుడుచేసే అవమానాలనించీ కూడా విముక్తిచెందడం అనేది 'స్త్రీ విముక్తి'లో భాగంగా వుంటుందా, లేదా?

'స్త్రీ విముక్తి' అన్నప్పుడు— ఆర్థిక దాస్యం నించి, రాజకీయ దాస్యం నించి మాత్రమే గాక పురుష పెత్తనంతో ఏర్పడే సాంఘిక దాస్యం నించీ కూడా విముక్తి చెందడమే స్త్రీలకు 'సంపూర్ణమైన విముక్తి'గా వుంటుందిగానీ, ఏదో ఒక్క విషయంలోనే మార్పు రావడం సాధ్యమూ కాదు, అది విముక్తీ కాదు.

మార్క్సిస్టు అయినవాడు స్త్రీల సంపూర్ణ విముక్తిని కోరుతాడు కాబట్టి, ఆ విముక్తికి అడ్డుపడే ఏ చర్యనీ, ఏ భావాన్నీ అంగీకరించకూడదు. ఒకవేళ సరైన అవగాహన లేకనో, బలహీనత వల్లనో, ఈ సమాజపు అలవాట్ల వల్లనో కొన్ని పొరపాట్లుచేసినా, సద్విమర్శ ఎదురైనప్పుడు ఆ మార్క్సిస్టు తప్పనిసరిగా ఆత్మవిమర్శ చేసుకోవాలి. ఆత్మవిమర్శ అంటే 'క్రైస్తవ పాపులు' గుండెలు బాదుకోవడం లాంటిది కాదు. తను చేసిన పొరపాటు ఏమిటో, ఆ పొరపాటు జరగడానికి మూలకారణం ఏమిటో, ఆ

పొరపాటుని ఎందుకు దిద్దుకోవాలో గ్రహించుకోవటంవల్ల ఆ పొరపాటు మళ్ళీ మళ్ళీ జరగకుండా చూసుకోగలుగుతాడు మార్క్సిస్టు.

మార్క్సిస్టు కూడ ఫ్యూడల్ వ్యక్తిలాగానో, బూర్జువా వ్యక్తిలాగానో స్త్రీలని అవమానపరిచే మాటలే వుపయోగిస్తే ఇక మార్క్సిస్టుకీ మిగిలిన వాళ్ళకీ తేడా ఏమిటి? అందుచేత మార్క్సిస్టు అయినవాడు బూతు మాటలు వుపయోగించ కూడదనడంలో ఎంతమాత్రం సందేహంలేదు.

ప్రజాతంత్రవాది కూడా విప్లవ మార్గంలో వుంటాడు కాబట్టి ఇతను కూడా బూతు మాటలు వుపయోగించ కూడదు. అయితే, ఇతను మార్క్సిస్టు అంత విప్లవ చైతన్యం కలిగినవాడు కాదు. మార్క్సిస్టు కోరినంత సంపూర్ణమైన స్త్రీల విముక్తిని ఇతను కోరడు. ఇతను కోరే స్త్రీ విముక్తిలో కొన్ని పరిమితులు వుంటాయి. ఇతను మార్క్సిస్టుకన్నా ఎక్కువగా బలహీనతలకూ, వొదుల్చుకోలేని అలవాట్లకూ లోబడి వుంటాడు. ఇతను కొన్ని సందర్భాల్లో బూతుపదాలు వాడకపోయినా, కొన్ని సందర్భాల్లో వాడుతాడు— అలా వుంటుంది ఇతని స్వభావం. మొత్తంగా చూసినప్పుడు— ఇతను కూడా స్త్రీల విముక్తికే ఎక్కువ అనుకూలంగా వుంటాడు.

ఇక, ఫ్యూడల్ భావాలూ, బూర్జువా భావాలూ గలవాళ్ళు స్త్రీల విముక్తిని కోరరు. స్త్రీని పురుషపెత్తనంలో వుంచడానికే చూస్తారు. స్త్రీలని అవమానం చెయ్యడం అనేది వీళ్ళకి పుటకతో అలవడిన విద్య. అందుకే వీళ్ళు స్త్రీలని అవమానించే బూతుమాటలు యధేచ్ఛగా వాడతారు. అలా వాడడమే వాళ్ళకు సహజం.

ఈ విషయాలు అర్థం చేసుకుంటే మార్క్సిస్టు అయిన వ్యక్తి ఎలా ప్రవర్తించాలో తేలిగ్గా అర్థం చేసుకోవచ్చు.

మార్క్సిస్టు రచయిత తన రచనలో తన భావాల్ని తనే డైరెక్టుగా చెప్పే సందర్భాల్లో బూతుమాటలు వాడకూడదు. రచనలోని పాత్రలచేత బూతుమాటలు వాడించేప్పుడు కూడా 'ఆ పాత్ర స్వభావం ఏమిటి' అనే విషయాన్ని సీరియస్‌గా దృష్టిలో పెట్టుకోవాలి. ఆ 'పాత్ర' కూడా మార్క్సిస్టు అయితే ఆ పాత్రచేత కూడా బూతులు వాడించకూడదు. ఆ పాత్ర ప్రజాతంత్ర భావాలుగల పాత్ర అయితే కూడా బూతులు చాలా తక్కువగా వాడించాలి— అదీ ఘోరమైన బూతులు కాకపోతేనే.

ఇక, ఆ పాత్ర ఫ్యూడల్ భావాలూ, బూర్జువా భావాలూ గల పాత్ర అయితే, బూతులు వాడించవచ్చును. భూస్వామి పాత్రచేత ఒక్క బూతుమాట కూడా అనిపించ

 

కుండా నీట్‌గా రాస్తే అది అసహజత్వంగా వుంటుంది. (భూస్వామి రంగంలోకి రాగానే బూతు తిట్టాలని దీని అర్థం కాదు.)

ఈ సందర్భాన్ని బట్టి, బూతుమాటల్ని ప్రయోగించిన కొన్ని కవితల్ని ఇక్కడ వుదహరిస్తాను.

1) గద్దర్ రాసిన 'నిర్మలక్క కథ' అనే పాటలో— (1973 అక్టోబరు 'సృజన')

"దొంగ లంజకొడకనీ దొర తిట్టీ ఎల్లగొట్టె" అని ఒక వాక్యం వచ్చింది. 'లంజకొడుకు' అనే తిట్టు పాలేరునీ, అతని తల్లినీ అవమానించే తిట్టని వేరే చెప్పక్కర్లేదు. అయితే, ఆ తిట్టు తిట్టిందెవరు?— భూస్వామి. భూస్వామి పాలేళ్ళపై చేసే దౌర్జన్యాన్నీ, అవమానాన్నీ చిత్రించడం ఆ రచనకు అవసరం. ఆ పాట రాసేది మార్క్సిస్టు అయినా ఆ తిట్టు భూస్వామి నోట తిట్టించి తీరాలి. లేకపోతే, భూస్వామి స్వభావాన్ని మరుగుపర్చినట్టు ఐపోతుంది. (ప్రతీఒక్క సందర్భంలోనూ భూస్వామి చేత బూతులు తిట్టించాలనే విధంగా కూడా అర్థం చేసుకోకూడదు.)

మార్క్సిస్టు అయినవాడు బూతుమాటలు రాయకూడదు కాబట్టి, అతని రచనలో ఎక్కడా ఆ మాటలు వాడకూడదు— అని అర్థం చేసుకోకూడదు.

2) 'నారా' రాసిన 'అపస్వరాలు' కవిత చూడండి. (1975 ఫిబ్రవరి 'సృజన')

"ఆకలేస్తోందా నీకు?
ఆంధ్ర సంస్కృతి మహోజ్వలమైనది
తినడానికి తిండిలేదా నీకు?
తెలుగు భాష 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్'
పోలీసులు నిన్ను చితగ్గొడుతున్నారా?
మనకి అంతర్జాతీయ ఖ్యాతి అవసరం"
.... .... .... ....
"నన్నయ్య గొప్పవాడు"
"నాకు ఆకలేస్తోంది"
"కృష్ణదేవరాయల కాలంలో...."
"ఒరేయ్! నాకు ఆకలేస్తోంది"
"ఏదేశ మేగినా, ఎందు కాలిడినా...."
"నీయమ్మ? నాకాకలేస్తోందిరా!"

ఆకలితో అలమటిస్తోన్న వ్యక్తిని (ప్రజల్ని) పట్టుకుని ఒక బాదస్తపు పెద్ద మనిషి ఆంధ్ర వైభోగాన్ని వర్ణిస్తున్నాడు. ఆ ఆకలి కేకలవాడు మొదలు కొంచెం

సహనం వహించి. చివరికో బూతు తిట్టాడు. అది ఎంత సహజమో! అది కవి తిట్టిన తిట్టు కాదు.

3) ఖూపాల్ రాసిన 'గొల్ల కుర్మ గోత్రం' పాటలో—(1974 డిసెంబరు ,సృజన')

గొల్ల కుర్మ గోత్రమింటవా
ఓరబ్బిగా
గొల్లోని బాధలింటవా
.... .... ....

బుడ్డంచుకు గట్కా మాడు
కుత్కెదాక గంజినీళ్ళు
కైదంబలి కైదరొట్టె
నిర్పకాయ ఉల్లిగడ్డ.... ఓర్నియాలి!

బతుకంతా గిదే తిండి
బువ్వదింటె ఒట్టురో.... ॥గొల్ల॥

ఎండ వాన కోడ్పి ఈపు
గొంగడి బొంతైపాయె
కాయలు గాసిన సేతులు
గొడ్డలి శిప్పలాయె.... హార్నియక్క
సెప్పుల్లేని కాళ్ళు
రాళ్ళవోలె గట్టిగాయె ॥గొల్ల॥
.... .... ....

ఈ పాటలో 'నీ అక్క', 'నీ ఆలి' అనే మాటలు 'తస్సదియ్యా' లాంటి వూత పదాలుగా వస్తాయి. ఈ గొల్లలకు అప్పుడే కొంత రాజకీయ చైతన్యం కలుగుతోంది. సాంస్కృతిక విషయాలలో ఆలోచనగానీ, స్త్రీ పురుషులు సమానులనే భావంగానీ ఇంకా రాలేదు. దానికింకా చాలా దూరం వుంది. ఈ పాటలో 'నీ అక్కా' 'నీ ఆలీ' అనే మాటలు కేవలం వూతపదాలుగా వుపయోగించినవి కావడంచేతా, అందులోనూ చాలా తక్కువ చైతన్యం కలిగిన గ్రామీణులు వుపయోగించినవి కావడంచేతా ఆ పదాల వాడకాన్ని తప్పుపట్టడానికి వీల్లేదు.

4) గద్దర్ రాసిన 'కల్లుముంతోయమ్మ' పాటలో— (1973 జూలై 'సృజన')

కల్లుముంతోయమ్మా – తల్లీ
నిన్ను మరువజాలనే
.... .... ....
నిన్ను పుచ్చుకుంటె గాని
నిషారాదె నాతల్లి
నిషాలోన నేను చాల
ఖుషీగుంటానే

రేపటి పూట ఫికరు
మరిచిపోతనే తల్లీ
అప్పులోని బాధ మరిచి
హాయిగుంటనే తల్లి
పొద్దంతా చేశ్ని కష్టం
మరిచిపోతనే తల్లీ
.... .... ....

లాడ్జీలు పెట్టి బతికె
లమ్డికొడుకును గాను
మంది కొంపలు ముంచే

ముండకొడుకును గాను
ఆలు పిల్లలున్నోన్ని
అన్న దమ్ములున్నోన్ని
.... .... ....

ఈ పాట పాడే వ్యక్తి నిరుపేద తాగుబోతు. తన పేదతనాన్నీ, అప్పుల్నీ ఇతర బాధల్నీ మరిచిపోడానికే ఇతను తాగుతాడు. వొళ్ళు వంచకుండా రకరకాల తప్పుదారుల్లో మస్తుగా డబ్బు సంపాయిస్తూ, తాగుళ్ళతో తిరుగుళ్ళతో విలాసాలతో కులికే నీచులమీద తన రోతనీ కోపాన్నీ తిట్లతో వ్యక్తంచేస్తాడు. ఆ తిట్లలో అతని నిజాయితీ, తప్పు పనులకు లోబడలేని అతని మంచి స్వభావమూ కనపడతాయి. ఆ తిట్లుకూడా ఘోరమైన తిట్లుగా లేవు.

5) గద్దర్ రాసిన 'ఓరోరి అమీనోడా' పాటలో— (1975 మే 'సృజన')

ఓరోరి అమీనోడా! ఓరోరి సరికిలోడా!
పదిలంగ వుండు కొడుకో! కదిలింది ఎర్రదండు
కదిలింది ఎర్రదండు, కదిలింది కూలిదండు
కదిలింది ప్రజాదండు, అరె.... కబడ్దారు కొడుకో
కదిలింది ఎర్రిదండు....
.... .... ....
నిన్న మొన్న దాకా, నీవోలె సీల్గినాడూ
మా పల్లె మిండెగాడు, పది వూర్ల దొరాగాడూ
.... .... ....
మా పల్లె దొరాగాడూ, నీ సెల్లె మొగడు కొడుకో
టాటాలు, బిర్లగాళ్ళు, నీ తల్లికి మిండేలు
.... .... ....

ఈ 'అమీనోడా' పాట ఎంత గొప్ప సాహిత్యంతో, ఎంత కళాత్మకంగా వుందో వేరే చెప్పక్కర్లేదు. ఆ పాటలో బూతుమాటల ప్రయోగం గురించి మాత్రమే ఇక్కడ చర్చ. ఈ పాట పాడేవాళ్ళు 'ప్రజాదండు'లో సాగేవాళ్ళు. వీళ్ళకి దొరల మీదా, పోలీసాఫీసర్లమీదా చెప్పలేనంత కసివుంది. ఆ కసిని చాలా చోట్ల (ఈ పాటలోనే వేరే చోట్ల) సభ్యంగానే బయటపెట్టారు. ఈ తిట్ల దగ్గిర మాత్రం తమని తామే అవమానం చేసుకోవడమూ, నిర్దోషులైన స్త్రీలని అవమానం చెయ్యడమూ చేశారు.

తమ పల్లెని ఒక 'స్త్రీ'తో పోల్చి, ఆ పల్లెలోని భూస్వామిని ఆ స్త్రీకి 'మిండె గాణ్ణి' చేశారు. అంతేగాక, ఆ భూస్వామిని పోలీసాఫీసరు చెల్లెలికి.... మొగుణ్ణి చేశారు. టాటాల్నీ బిర్లాల్నీ పోలీసాఫీసరు తల్లికి.... మొగుళ్ళని చేశారు.

దోపిడిదారుల్ని కూల్చాలనే విప్లవ చైతన్యంతో ప్రజాదండులో చేరిన ప్రజలపై నాయకత్వపు చెకింగ్ వుండదా? దండుకి నాయకత్వం వుండదా? నాయకత్వపు చైతన్య స్థాయి ఎప్పుడూ ప్రజల చైతన్య స్థాయిని మించి వుంటుంది, (వుండకపోతే అది నాయకత్వ స్థానానికే పనికిరాదు) ప్రజలు తమ శతృవులందరిమీదా (వర్గ శతృవుల మీద) రకరకాల బూతులు గుప్పించాలనే వుత్సాహంతో వుండవచ్చు– సరైన మార్గం తెలీక. ప్రజలు ఏ పనిచేస్తే ఆ పనికే, ఏ మాట మాట్లాడితే ఆ మాటకే, దాని మంచిచెడ్డలు గమనించకుండా నాయకత్వం వంత పాడకూడదు. నాయకుడు ఎప్పుడూ ప్రజలకన్నా వెనకబడి వుండడు. అలాగే, ప్రజల స్థాయితో సమానంగా మాత్రమే వుండడు. తప్పనిసరిగా ప్రజలకన్నా ఒక్క అడుగు ముందే వుంటాడు. అందుకే అతను ప్రజల స్థాయిని పరిశీలిస్తూనూ వుంటాడు, ఆ స్థాయిని పెంచడానికి తగిన సూచనలుచేసి వారిని ఇంకా ఇంకా అభివృద్ధి పరుస్తూనూ వుంటాడు. "ప్రజల స్థాయి ఇదే" అని ఆ స్థాయిలోనే వార్ని వుంచడం గాక, వాళ్ళని ఎడ్యుకేట్ చెయ్యడమూ, లీడ్ చెయ్యడమూ నాయకుడి పనులు. ఈ 'అమీనోడా' పాటలో వున్న పొరపాట్లని ప్రజాదండు నాయకత్వం గ్రహించవద్దా? "మీ కోపం అంతా పోలీసాఫీసర్ల మీదే కాబట్టి వాణ్ణి ఎన్ని రకాలుగానైనా తిట్టండి. 'పండేసి తొక్కుతాము' 'చుట్టేసి చంపుతాము' 'కడతాము నీకు గోరి' లాంటి మాటలు ఇంకా ఇంకా వాడండి అవసరమైతే. అతని తల్లికీ, చెల్లెలికీ మిండెగాళ్ళని అంటగట్టి నిర్దోషుల్ని ఎందుకు అవమానం చేస్తారు? అది ఎలాంటి న్యాయం? ఒక కొడుకుని కనడమా ఆ తల్లి తప్పు?– అని నాయకత్వం ప్రశ్నిస్తే ఆ పాట పాడేవాళ్ళు తమ తప్పుని గ్రహించుకోరా? ప్రజల సాంస్కృతిక స్థాయిని పెంచవలసిన అవసరాన్ని గ్రహించకుండా 'ప్రజలకి బూతులు తిట్టడమే ఇష్టం; వాళ్ళ ఇష్టానికి అడ్డుపోకూడదు' అని నాయకుడు అంటే, ఇక ప్రజల్లో తప్పుధోరణుల్ని అరికట్టేది ఎలాగ? ఈ నాయకుడు ఆ తప్పుల్నే ప్రోత్సహించి, ఆ తప్పులవెంట తనూ పోతున్నాడన్నమాట. అది ప్రజల్ని అనుసరించడం మాత్రమే అవుతుందిగానీ, ప్రజల్ని ఎడ్యుకేట్‌చేసి లీడ్‌చెయ్యడం అవదు.

కేవలం బూతుమాటల వాడకం గురించే గాక, ఈ సందర్భంలో, స్త్రీలని అవమానించే మరికొన్ని రకాల భావాల్ని (కాన్‌సెప్ట్సని) గురించి కూడా ప్రస్తావించాలి.

"మొగుణ్ణి కొట్టి మొగసాలెక్కింది."

"ఆడదానిలాగా గాజులేసుకున్నారా ?"

"ఫలానా ఆయన కూతుర్ని ఫలానా ఆయన కొడుక్కి ఇచ్చారు" ('ఇవ్వడం' అనే మాటని అలా వుంచి, ఆ పెళ్ళిచేసుకునే వాళ్ళిద్దరూ తల్లులనే క్షుద్రులు లేకుండా, తండ్రులనే మహానుభావులవల్ల మాత్రమే పుట్టి పెరుగుతూ వుంటారు. ఇప్పుడీ పెళ్ళి చేసుకునే పిల్ల కూడా తన పిల్లల పెళ్ళిళ్ళనాటికి అంతర్థానమైపోయి తండ్రి మాత్రమే మిగులుతాడు. ఈ కమ్యూనిస్టుల పేపర్లు నడిచినంత కాలమూ ఆడవాళ్ళు లేకుండానే పిల్లలు పుడుతూవుంటారు) నేను చూపించిన ఈ రకం వుదాహరణ 'విప్లవ (?) కమ్యూనిస్టుల' పేపర్లలో కూడా వస్తూవుంటాయి. వీరి ఉద్దేశ్యంలో మార్క్సిజం అంటే రాజకీయ మార్పుల్ని మాత్రమే కలిగిస్తుంది- అని.

మావో- మార్క్సిస్టుల్ని రెండు రకాలుగా విభజించారు.

1. 'సిద్ధాంతం' విషయాలలోనూ, నిర్మాణ కార్యక్రమాలలోనూ కూడా మార్క్సిస్టులుగా వుండేవారు.
2. నిర్మాణ కార్యక్రమాలలో మాత్రమే మార్క్సిస్టులుగా వుండేవారు.

మొదటి రకంవారు మార్క్సిస్టు సిద్ధాంతాన్ని సరైన దృక్పథంతో, అది ఒక సైన్సుగా ఎలా వుందో, దానికి సంబంధించిన అన్ని కోణాలూ అర్థం చేసుకుంటారు. ఒక దోపిడీ సమాజంలో అన్నివర్గాలలోనూ, స్త్రీ పురుషులలోనూ ఆర్థిక, రాజకీయ, సాంఘిక మార్పులు ఎలా సంభవమవుతాయో, దానికి తాము ఏం చెయ్యవలసి వుంటుందో అర్థం చేసుకుంటారు.

ఈ సిద్ధాంత జ్ఞానంతోనే వారు నిర్మాణ కార్యక్రమాలలో పాల్గొంటారు.

రెండోరకం మార్క్సిస్టులకు సిద్ధాంతం అనేది దాదాపుగా ఏమీ తెలీదు, సమాజంలో ఎందుకు మార్పులు కలుగుతున్నాయో, ఏ శక్తులు సమాజాన్ని మారుస్తున్నాయో తెలీదు. ప్రజలంతా ఏఏ రకాల దాస్యాలలో వున్నారో, ముఖ్యంగా స్త్రీలపై పురుష పెత్తనం ఎందుకు సాగుతోందో, అది ఎప్పుడు పోయే వీలుందో, స్త్రీవిముక్తికీ సోషలిస్టు సమాజానికీ సంబంధం ఏమిటో- ఇలాంటి విషయాలేమీ తెలీవు. తెలిసినా అరకొరగా మాత్రమే తెలుస్తాయి. ఆ అరకొర జ్ఞానంతోనే పార్టీలోనో, ప్రజా సంఘాలలోనో పనులు చేస్తూ వుంటారు. తాము ఎటువంటి మార్పులకోసం పని చేస్తున్నారో, ఆ మార్పులు ఎటువంటి కొత్త సమాజాన్ని సృష్టిస్తాయో. ఆ సమాజంలో

ప్రజల జీవితాలూ, ప్రజా వ్యతిరేకుల జీవితాలూ. ఇంకో కోణంనించి చూసినప్పుడు స్త్రీ పురుషుల జీవితాలూ ఎటువంటి మార్పులకు లోనవుతాయో అర్థంచేసుకోకుండానే 'పైవాళ్ళు' చెప్పిన పనులు మాత్రం కొన్ని చేస్తూవుంటాడు. సిద్ధాంతం తెలీకుండా చేసే పనులు కాబట్టి, ఆ పనుల్లో లక్ష తలనొప్పులు సృష్టిస్తారు. (ఈ అరకొర మార్క్సిస్టులు చిత్తశుద్ధితో ప్రయత్నిస్తే సిద్ధాంతం నేర్చుకోవడం ఆరునెలల పని)— సిద్ధాంతం సంపూర్ణంగా నేర్చుకున్నాకే నిర్మాణ కార్యక్రమాల్లోకి దిగాలని దీని అర్థం కాదు. కానీ, ఎన్నటికీ సిద్ధాంతాన్ని నేర్చుకోవాలని ప్రయత్నించక పోవడం. దానికి విలువ ఇవ్వక పోవడం మాత్రం సరైన మార్క్సిస్టు లక్షణం కాదు.

మార్క్సిస్టునని చెప్పుకునే ప్రతివ్యక్తీ మార్క్సిస్టేననీ, సిద్ధాంతం తెలిసిన మార్క్సిస్టు అయితే ఎప్పుడూ సరిగానే ఆలోచిస్తాడనీ భావించకూడదు. పొరపాట్లు చెయ్యడం. తర్వాత అనుభవాల్ని బట్టి వాటిని దిద్దుకోడం, అభివృద్ధి చెందడం నిరంతరం జరుగుతూనే వుంటుంది.

స్త్రీల విషయంలో ఫ్యూడల్ కాన్సెప్ట్స్‌తోనే మార్క్సిస్టులు ప్రవర్తిస్తున్నారు— అనే విషయాన్ని "నిశిత పరిశీలనా? దగాకోరు పరిశీలనా?" అనే పుస్తకంలో ప్రస్తావించాము. ఈ సందర్భానికి అది చాలా అవసరం అని ఆ పుస్తకంనించి ఒక పేరా ఇక్కడ కోట్ చేస్తున్నాను,

“'లేచిపోవడం' అంటే అర్థం ఏమిటి? ఒక స్త్రీకి భర్తతో జీవించడం ఇష్టంలేక (అసలు భర్తే లేకనో) ఇంకో పురుషుడితో జీవించడానికి ఇష్టపడి వెళ్ళి పోవడం. ఆ పని ధైర్యంగా చేసే అవకాశాలు వుండవు కాబట్టి (సమాజం కల్పించదు కాబట్టి) ఆ స్త్రీ ఆపని రహస్యంగా చేస్తుంది. స్త్రీ - భర్తనే పూజించే ధర్మానికి లొంగివుండక ఇంకో పురుషుడితో జీవించే స్వేచ్ఛని అంగీకరించని సమాజం ఆ స్త్రీ చేసిన పనిని నీచపరుస్తూ, 'లేచిపోవడం'గా చిత్రిస్తూ, ఆ లేచిపోవడాన్ని మహా దుర్మార్గంగా, పాపకార్యంగా భావిస్తుంది.

మరి, స్త్రీ ఇష్టాన్నీ వ్యక్తిత్వాన్నీ సమర్థించే మార్క్సిస్టు, ఒక స్త్రీ తనకిష్టమైన పురుషుడితో జీవించడాన్ని 'లేచిపోవడం'గానే భావిస్తాడా? అయితే సనాతనవాదులికీ, ఈ మార్క్సిస్టుకీ తేడా ఏమిటి? స్త్రీలని చులకనచేసే నీచులు వాడే పదాలు వాడుతూ, వాళ్ళు తీసే అర్థాలే తీస్తూ 'లేచిపోయింది'. 'కడుపైంది' అని వాగేవాడు స్త్రీల శ్రేయస్సుని కోరినవాడా?”

మనం అసలు సంగతికి మళ్ళీ వస్తే– వరవరరావుగారి 'స్వేచ్ఛ' పుస్తకం గురించి 'ప్రజాసాహితి'లో చేసిన విమర్శలో ఒకచోట సమీక్షకుడు ఇలా రాశాడు– "ఎన్నో మంచి విషయాలకు సున్నితంగా, కళాత్మకంగా స్పందించిన ఈ కవి, విప్లవ కవులనబడే వారిలో చాలామందికున్న ఒక జాడ్యానికి తనూ లోనయ్యాడు.

"మార్క్సిజం మాటల్లో వల్లించే కొజ్జాలు"
"....రంకు సాగిస్తున్నది రివిజనిజం ఇవ్వాళ" – ఈ ధోరణితో.

'సజ్జలు తిని సజ్జలు ఏరిగే కోడి' లాంటి ఎక్స్‌ప్రెషన్స్‌ని భరించవచ్చేమోగాని, సెక్సు సంబంధాన్ని నీచంగా చిత్రించే 'రంకు' అనే మాటనీ, జీవశాస్త్రానికి సంబంధించిన లోపాలతో పుట్టినవారిని హేళనచేసే 'కొజ్జాల'నే మాటనీ భరించలేం. క్షమించలేం"– అన్నాడు సమీక్షకుడు.

దీనిమీద వరవరరావుగారు తప్పుని అంగీకరించడం అంటే మార్క్సిస్టుగా చెయ్యవలసిన పని చేశారు. ఇది విశాఖపట్నం మార్క్సిస్టుకి 'చాదస్తం'గా 'ఆదర్శవాదం'గా కనిపించిందట! ఆయన అంటారూ– "సంపాదకీయంలో చాదస్తం, ఆదర్శవాదం కనిపించాయి. చివరకు మనం జైనుల్లాగా తయారవుతామేమో! పొట్టిబావ, మరుగుజ్జులు, మూగవాడిముందు ముక్కుగోక్కోవడం, బట్టతలకు మోకాలికి ముడివెయ్యడం, పిలకరాయుళ్ళు– నిత్యజీవితంలో ఇలా ఎన్నో వాడుతాం. అలాంటప్పుడు మాచకమ్మ, రంకు లాంటి మాటలు వాడ్డంలో తప్పేమిటి?" అంటున్నారు. (ఆయన చెప్పిన మాటల్లో కూడా కొన్ని మాటలు వాడుడు తప్పే. 'పొట్టిబావా – చిట్టి మరదలూ' లాంటివి ఫ్యూడల్ సరసాలకు సంబంధించిన విషయాలు, ప్రజాతంత్రి భావాలు కలిగిన వాళ్ళు కూడా ఇలాంటి సరసాల్ని వొదిలేస్తారు. 'బట్టతలకీ మోకాలికీ ముడిపెట్టడం' అనేది ఒక అసాధ్యమైన విషయానికి పోలికగా వుంటుంది. ఇందులో బట్టతల గలవాళ్ళనో, మోకాళ్ళు గలవాళ్ళనో అవమానం చెయ్యటం అనేది వుండదు, ఒకవేళ ఈ విషయాలన్నిటినీ వొదిలేసినా, 'పొట్టిబావా – చిట్టిమరదలూ' అనే మాటల్లాంటివేనా 'రంకూ', 'మాచకమ్మా' అనే మాటలు?)

మాచకమ్మా, రంకూ అనే మాటలు వాడడంలో తప్పులేదనడానికి ఋజువుగా– విశాఖ మార్క్సిస్టు–

"పోయిన కాంగ్రెసు ప్రతిష్ఠ
పుంజుకునే దెప్పుడు
సరదాపడి మాచికమ్మ
సమర్తాడినప్పుడు"– అని శ్రీశ్రీ రాసిన కవితను చూపిస్తున్నారు.

మొట్టమొదటి ప్రశ్న– శ్రీశ్రీ రాస్తే, తప్పు తప్పుకాకుండా పోతుందా? లేక శ్రీశ్రీ రాసిందంతా కరెక్టు అవుతుందా?

రెండో ప్రశ్న– శ్రీశ్రీ ఎన్నడూ తప్పులు చెయ్యని మార్క్సిస్టుగానో, చిత్త శుద్ధితో ఆత్మవిమర్శలు చేసుకున్న మార్క్సిస్టుగానో రుజువయ్యారా?

శ్రీశ్రీ కనీసపు 'క్రమశిక్షణ' లేని వ్యక్తి. ఫ్యూడల్ దృక్పథాన్ని పూర్తిగా వొదిలించుకోని వ్యక్తి– ముఖ్యంగా స్త్రీల విషయంలో.

పోయిన కాంగ్రెసు ప్రతిష్ట మళ్ళీ రావడం అనేది ఎన్నటికీ జరగని అసాధ్య మైన విషయం– అని చెప్పదల్చుకుంటే, 'మాచకమ్మ సమర్తాడడం' 'గొడ్రాలికి పిల్లలు పుట్టడం' లాంటి పోలికలే దొరికాయా కవికి?

"పోయిన కాంగ్రెస్ ప్రతిష్ట
పుంజుకునే దెప్పుడు
సూది బెజ్జంలోంచి ఒంటె
దూరగలిగి నప్పుడు"– అని ఎందుకు రాయకూడదు?

లేదా,

"తివిరి ఇసుమున తైలం
తీయగలిగి నప్పుడు"– అని ఎందుకు రాయకూడదు?

(ఇవే అని కాదు– ఇలాంటి రకం పోలికలతో. మహారాజు తలిస్తే దెబ్బలకు కొదవా? అన్నట్టు మహాకవి తలిస్తే పోలికలకు కరువా?)

ఆ రకం పోలికలు ఎందుకు రాయలేదంటే– స్త్రీలని అవమానించరాదనే సంస్కార భావాలు మనకి వుంటేకదా ఆ పోలిక మానేసి ఇంకో పోలిక కోసం వెతకడానికి?

'మాచకమ్మ సమర్తాడడం' అన్నా తప్పులేదు, 'పళ్ళూడిన ముసల్ది కుచ్చెళ్ళు సవరించడం' అన్నా తప్పులేదు ఈ పురుషపుంగవులికి. 'గొడ్రాలికి పిల్లలు పుట్టడం' 'మాచికమ్మ సమర్తాడడం' లాంటి మాటల్లో ఎంత వెటకారంవుందో, ఎంత వెకిలితనం వుందో, ఎంత అమానుషత్వం వుందో సీరియస్‌గా అర్థంచేసుకున్న కవి ఆ రకం పోలికలే వుపయోగించలేడు. ఆనాడు ఆ పోలిక ఎందుకు వుపయోగించావని కవిని ఈనాడు నిలదియ్యవలసిన అవసరంలేదు. కానీ, అలాంటి పోలికలు రాయడంలో తప్పేలేదని మార్క్సిస్టులం అనుకొనేవాళ్ళు ఈనాడు వాదించడం పరమ అసహ్యంగా

వుంది. ('ఈనాడు' అంటే– అవతల కమ్యూనిస్టు చైనాలో - 'గృహిణులూ' 'ధర్మ పత్నులూ' 'అర్ధాంగులూ' అంతర్ధానమైపోయి, ఫ్యూడల్ పదజాలాన్నే భూస్థాపితం చేసేసిన కాలంలో.)

మరియా అనే ఇటలీ రచయిత్రి జనచైనాలో పర్యటించినప్పుడు మాటల సందర్భంలో ఒకసారి 'మావో భార్య' అంటే, ఆ మాటలకి చైనా కామ్రేడ్స్ నిర్ఘాంత పోయారట. అప్పుడు ఈవిడ తన తప్పు గ్రహించుకుని తను 'చియాంగ్' గురించి మాట్లాడుతున్నానని చెప్పింది. స్త్రీలను భర్తలద్వారా గుర్తించడం అనేది స్త్రీలకు చాలా అవమానకరమైన విషయంగా భావిస్తామని చైనా కామ్రేడ్స్ అన్నారు.

'ఫలానా అతని భార్య' అని స్త్రీ వ్యక్తిత్వాన్ని గుర్తించకుండా మాట్లాడడమే స్త్రీకి అవమానం అయినప్పుడు, 'మాచకమ్మలూ' 'గొడ్రాళ్ళూ' 'రంకు సాగించడాలూ' మాత్రం ఏమీ తప్పులేనివా?

రష్యాలో, 1915 లో, లెనిన్ ఒక సరస్సు తీర ప్రాంతంలో రహస్య జీవితం గడుపుతూ వున్నప్పుడు ఒక సాయంత్రం కొందరు విప్లవకారులతో కలిసి ఆయన సరస్సు తీరంలో కూర్చునివుంటారు. కొందరు వినోద యాత్రికులు పడవల్లో షికార్లు చేస్తూ పాడుకునే బూతుపాటలూ, లల్లాయి పాటలూ ఒడ్డుకి వినిపిస్తూవుంటాయి. వుదాహరణకి– ఒక పాట ఇలా వుంటుంది.

"బుట్ట బొమ్మలాంటి బుల్లెమ్మ వచ్చింది
పైనించి చూడంగ గౌను కానవచ్చె
అటు క్రింద చూడంగ లేసులల్లిన లాగు
అటు క్రింద.... అటు క్రింద...." (నీలం నోట్‌బుక్)

ఈ రకం పాటలు వింటూ ఒడ్డుమీద కూర్చున్న విప్లవకారులు చాలా చీదరపడతారు. లెనిన్ కూడా చాలా బాధపడుతూ– "మనకు నచ్చినా నచ్చకపోయినా, దేశంలో వున్న మనుష్య శక్తి ఇదీ. లొల్లాయి పదాలు పాడుకుంటూ, బూతుకూతలు కూసుకుంటూ, గాలికి తిరిగినట్లు బాధ్యతా రహితంగా నౌకా విహారాలు చేసే ఈ క్షుద్రుల సాయంతోనే విప్లవమూ నిర్వహించాలి, సోషలిస్టు రాజ్యమూ నిర్మించాలి. సోషలిజం కోసం ప్రత్యేకంగా వేరే మనుషుల్ని తయారుచేసుకోడం సాధ్యం కాదు"– అని అభిప్రాయపడతారు. ఆ నౌకా విహారాలు చేస్తూ ఆ పాటలు పాడినవాళ్ళు విప్లవ రాజకీయాలు గలవాళ్ళు కారు. చాలా సామాన్యులు. అలాంటి వాళ్ళ 'బూతుకూతలు కుయ్యడాన్ని' కూడా తప్పు

పట్టాడు లెనిన్. ఇక విప్లవకారులమని చెప్పుకునే వాళ్ళు బూతు కూతలు కూసినా, వాటిని సమర్థించినా ఆయన ఏమనేవాడో ఎవరికి వాళ్ళు వూహించుకోవలిసిందే.

1923 లో, రష్యాలో, 'పారిస్ కమ్యూన్ షూ ఫ్యాక్టరీ' కార్మికులంతా బూతు మాటలు వాడకూడదని నిబంధన చేసుకున్నారు. బూతుమాటలు స్త్రీలని అవమానించడమే గాక, గతంలో ధనికవర్గాల వాళ్ళు పేద వర్గాల వారిని బూతుతిట్లతో అవమానం చేసే వారు కాబట్టి, ఇప్పుడు కూడా (సోషలిస్టు సమాజంలో కూడా) కార్మికులు బూతు మాటలు వాడడం అంటే తమని తాము గౌరవించుకోవడం నేర్చుకోక పోవడమేననీ, (ఆత్మగౌరవం నేర్చుకోక పోవడమని) గ్రహించుకున్నారు. అందుకే కార్మికులు బూతుమాటలు వుపయోగించ కూడదనీ, వుపయోగించిన వాళ్ళు 'జరిమానాలు చెల్లించడం' వంటి శిక్షలు పొందాలనీ కార్మికులంతా ఇష్టంతోనే తమమీద తాము నిబంధన పెట్టుకున్నారు. బూతులు వుపయోగించడం తప్పుకాదని వాదించే అపర మార్క్సిస్టులు దీనికేమంటారు?

నాకు తెలిసిన ఒక అమ్మాయికి పదేళ్ళప్పుడు పెళ్ళయింది. పదహారేళ్ళ వరకూ ఆమె పెద్దమనిషి కాలేదని భర్త విడిచిపెట్టేసి రెండో పెళ్ళి చేసుకున్నాడు. ఆ అమ్మాయి తల్లి దండ్రులు చాలా పేదవాళ్ళు కావడంచేత ఆమెకు సకాలంలో వైద్యం చేయించలేదు. తర్వాత కూడా ఆమె పెద్దమనిషి కాలేదు. స్త్రీలను అనేక రకాలుగా హీన పరిచే ఈ సమాజంలో (మార్క్సిస్టులు కూడా ఫ్యూడల్ మూర్ఖులుగావున్న ఈ సమాజంలో) 'పెద్దమనిషి' గాని స్త్రీకి ఎన్ని అవమానా లెదురౌతాయో సహృదయులు ఊహించలేని విషయం కాదు. ప్రస్తుతం ఆమె తన వారందరికీ దూరంగా ఒక ఆశ్రమంలో చాకిరీ చేస్తూవుంది.

పిల్లలు పుట్టని స్త్రీలకు కూడా ఇలాంటి కష్టాలూ, అవమానాలూ ఎదురౌతూ వుండడం అందరికీ తెలిసిందే (మంచివాళ్ళందరికీ). అలాంటి స్త్రీలకి దోపిడీ కవితలు చేసే అవమానాలు చాలక మీ 'విప్లవ' కవితల్లోకి కూడా వాళ్ళని లాగి, వెక్కిరించి వెటకారాలు చేస్తేనే గానీ మీ కవితలు కళా 'వైదగ్ధ్యం'తో ప్రకాశించవా?

"రంకు సాగిస్తోంది రివిజనిజం" అనకపోతే రివిజనిజాన్ని చీదరించుకోడానికి ఇంకో పదం లేదా? ఇంకో మార్గం లేదా?

మార్క్సిజాన్ని మాటల్లో వల్లించి, చేతల్లో ఆచరించని వాళ్ళని 'కొజ్జా'లతో ఎందుకు పోల్చాలి? నిజాయితీలేని పనులు కొజ్జాలు చేస్తారా? నిష్కారణంగా క్రూరమైన తిట్టు వాళ్ళమీద!

చెప్పేది ఒకటీ, చేసేది ఒకటి చేసే రివిజనిస్టుల్ని మోసగాళ్ళు అనరాదా? దగాకోర్లు అనరాదా? అవకాశవాదులు అనరాదా? అబద్ధీకులు అనరాదా? గుంట నక్కలో, ఊసరవెల్లులో అనరాదా? ఎన్ని మార్గాలులేవు!

విశాఖ మార్క్సిస్టు తనవాదం చివర– "గాంధీగారిలాగా వ్యక్తిగత ఆదర్శ వాదం వల్ల మనం గొప్పవాళ్ళ మనిపించుకోవచ్చు– కానీ, అందువల్ల జనానికి ఒరిగిం దేమిటి? మనది మాస్‌లైన్ మరచిపోవద్దు" అన్నారు.

సృజన పాఠకులు నన్ను క్షమిస్తే– విశాఖ మార్క్సిస్టు మాటల్ని "ఎంత చెత్త వాగుడు" అనకుండా వుండలేకపోతున్నాను.

"మనది మాస్ లైన్ (ప్రజాపంథా) మరిచిపోవద్దు"– అన్న మాటల్లో అర్థం ఏమిటంటే– "ప్రజలు బూతులు మాట్లాడతారు కాబట్టి, మనం (మార్క్సిస్టులం) కూడా బూతులు మాట్లాడడంలో తప్పులేదు. ప్రజలు మాట్లాడే బూతులన్నీ రచనల్లోకి ఎక్కించడంలో తప్పులేదు. మనది ప్రజల దారి కదా? ప్రజలు ఏ దారిన నడిస్తే, మనం ఆ దారినే నడవాలి. అలా నడిస్తేనే మనది ప్రజాపంథా అవుతుంది" అని చెప్పడం అన్నమాట. ('మనది మాస్‌లైన్' అనడంలో అర్థం నేననుకున్నది గాక ఇంకోటి అయితే అదేమిటో ఆయన చెప్పిన తర్వాత దాన్ని గురించి ఆలోచిస్తాను ప్రస్తుతానికి మాత్రం ఈ అర్థంతోనే మాట్లాడుతున్నాను.)

ఇప్పుడు మనం స్పష్టంగా కొన్ని ప్రశ్నలు వేసుకోవాలి.

– ప్రజా పంథా అంటే ఏమిటి?

– ప్రజలు ఏ పని చేస్తే మార్క్సిస్టు కూడా ఆ పని చెయ్యడమేనా? ప్రజలు ఏ దారిన నడిస్తే మార్క్సిస్టు కూడా ఆ దారిన నడవడం మాత్రమేనా?

– ప్రజలకు నాయకత్వం వహించడం అంటే ఏమిటి?

ఇలాంటి ముఖ్యమైన ప్రశ్నలకు క్లుప్తంగా జవాబులు తెలుసుకుంటే ఈ 'బూతు మాటలు వాడడం' అనే సమస్యలో మార్క్సిస్టు రచయిత ఎలా ప్రవర్తించాలో, ఎలా ప్రవర్తిస్తే ప్రజాపంథా అవుతుందో తెలుసుకోవచ్చు.

'ప్రజాపంథా' అనే పద్ధతిని చైనా కమ్యూనిస్టు పార్టీ, రష్యా అనుభవాలనించీ గ్రహించినట్టుగా ఆ పార్టీ చెపుతోంది– "ఆ కాలంలో (అక్టోబరు విప్లవ కాలంలో) సోవియట్ అనుభవం నించి, మన పార్టీ తరుచుగా మాట్లాడే 'ప్రజాపంథా' అనేది గ్రహించబడింది."

చైనా కమ్యూనిస్టుపార్టీ, రష్యానించి 'ప్రజాపంథా' అనే పేరుతో ఏ పద్ధతినైతే గ్రహించిందో ఆ పద్ధతి ఎటువంటిది: ఆ పద్ధతిని లెనిన్ ఇలా వివరిస్తున్నారు– "(నిరంతరం ప్రజలతో సంబంధాలు ఏర్పర్చుకోవడం ద్వారా) ఈ పద్ధతిలో, కేవలం ఈ పద్ధతిలో మాత్రమే పురోగామి దళం (కమ్యూనిస్టు పార్టీ) ప్రజల ప్రయోజనాలను వ్యక్తం చేస్తూ, వారికి నిర్మాణం బోధిస్తూ, చైతన్యవంతమైన వర్గ రాజకీయాల మార్గంలో వారి కార్యకలాపాలన్నిటికీ దరకత్వం వహిస్తూ– వారికి శిక్షణనూ, వికాసాన్నీ ఇస్తుంది,"– ఇదీ 'ప్రజాపంథా' పద్ధతి.

'ప్రజాపంథా'ని మావో క్లుప్తంగా –"ప్రజలనించి, ప్రజలదగ్గరికి" అన్నారు.

ముందు ప్రజల అభిప్రాయాలు తీసుకోవాలి– ఆ అభిప్రాయాలు అనేక రకాలుగా, ఒకదానికీ ఇంకోదానికీ సంబంధం లేనట్టుగా వుంటాయి. వాటినన్నిటినీ పరిశీలించాలి, వాటిలో మంచిచెడ్డలు గ్రహించాలి. ప్రజల ప్రయోజనాలకు ఏ అభిప్రాయాలు ఉపయోగపడతాయో ఆ దృష్టితో పరిశీలించి మంచిచెడ్డల్ని వేరుచెయ్యాలి. ప్రజల అభిప్రాయాలలో తప్పుగా వున్నవాటిని (అంటే: ప్రజల శ్రేయస్సుకే హాని కలిగించే వాటిని) గురించి ప్రజలకు వివరించి చెప్పి, వారి తప్పు ధోరణి వారికి తెలిసేట్టుగా చెప్పి, సరైన పద్ధతి చూపించాలి. అంటే– ప్రజల అభిప్రాయాల్ని తీసుకోవడమూ, వాటిని పరిశీలించడమూ, తిరిగి ప్రజలకు ఇవ్వడమూ– అన్నమాట.

ఒక విషయంలో ప్రజల అభిప్రాయాలు సరిగ్గానే వుంటే, దానిలో సరిదిద్దవలసినదేమీ లేకపోతే, అంతకన్నా పైస్థాయి జ్ఞానానికి ప్రజల్ని నడిపించాలి.

"మన పార్టీ 'ఆచరణ కార్యక్రమం' మంతటిలోనూ 'ప్రజల నుంచి, ప్రజల దగ్గరకు' అనే విధానాన్ని తప్పనిసరిగా అనుసరించడమే సరైన నాయకత్వ విధానం. దీని అర్థం ఇదీ: ప్రజలనించి అభిప్రాయాలు తీసుకోవాలి (పరస్పర సంబంధం లేకుండా, ఒక పద్ధతిలో లేకుండావుండే అభిప్రాయాలు).

వాటిపై కేంద్రీకరించాలి (వాటిపై అధ్యయనం చేసి, క్రమ పద్ధతితో కూడిన, సూటియైన అభిప్రాయాలుగా వాటిని మార్చాలి.)

అప్పుడు తిరిగి ప్రజల దగ్గరికి వెళ్ళాలి, ప్రజలు ఆ అభిప్రాయాలను తమ స్వంత అభిప్రాయాలుగా స్వీకరించేలా, వారికి వివరించి ప్రచారం చెయ్యాలి. వాటిని గట్టిగా సమర్థించాలి. కార్య రూపంలో పెట్టాలి. ఆచరణలో ఈ (కొత్త) అభిప్రాయాలు ఎంతవరకు సరైనవో పరీక్షించాలి. మళ్ళా ప్రజల అభిప్రాయాలపై కేంద్రీక

వెంచి తిరిగి ప్రజల దగ్గరికి వెళ్ళాలి ... అంతులేకుండా పదే పదే ఈ పద్ధతిని అనుస రించు...."- (మావో) - ఇదీ 'ప్రజాపంథా'కు అర్థం.

ప్రజలు ఏ పనిచేస్తే ఆ పనినే సమర్థించడమూ, ప్రజలకు ఏ అభిప్రాయంవుంటే ఆ అభిప్రాయానికే తల వూపడమూ (మంచిచెడ్డల విచక్షణ లేకుండా ప్రజల్ని అనుస రించడం) కాదు మార్క్సిస్టు చెయ్యవలసింది.

ప్రజల అభిప్రాయాల్ని యథాతథంగా తీసుకోవడమే అయితే అసలు 'నాయకుడు' అనేవాడు ఎందుకు? ప్రజలకు వర్గరాజకీయాలు బోధించడం; నిర్మాణం బోధించడం; ప్రజలకు క్రమశిక్షణా, వికాసమూ నేర్పడం; ప్రజల్ని 'డైరెక్టు' చెయ్యడం- వీట న్నిటికీ అర్థం ఏమిటి?

ప్రజలు ఒక విషయంలో తప్పు దారిన పోతూ వున్నప్పుడు నాయకుడు 'ఇది తప్పుదారి- ఈ దారి మనల్ని గమ్యానికి చేర్చదు' అని ముందు చెపుతాడు. ప్రజలు వింటే సరే, వినకపోతే నాయకుడు ప్రజల్ని విడిచిపెట్టి ఇంకోదారికి పోడు. తానూ ప్రజలవెంటే పోతాడు. కానీ తన విమర్శలూ, హెచ్చరికలూ వొదులుకోడు. ప్రజలకు ఏది మేలో, ప్రజలు ఏది చెయ్యవచ్చునో, చెయ్యకూడదో, ప్రజలకన్నా ఎక్కువ తెలిసినవాడే నాయకుడు అవుతాడు.

బూతుమాటలు వాడడం విషయంలో 'ప్రజాపంథా' ఎలా వుండాలి- అని ఆలో చిస్తే, ప్రజలు బూతులు వాడుతున్నారు, నిజమే. ప్రజలు బూతులు వాడుకున్నారు కాబట్టి, మార్క్సిస్టు కూడా బూతులు వాడడమేనా?- ఇది శుద్ధ తప్పని- మళ్ళీ చెప్పక్కర్లేదు. ఇది 'ప్రజాపంథా'ని ఉత్త యాంత్రికంగా అర్థంచేసుకోవడమే.

ఒక మార్క్సిస్టుకి ముందు తన సాంస్కృతిక స్థాయిని పెంచుకోవడమూ, తర్వాత ప్రజల సాంస్కృతిక స్థాయిని పెంచడానికి ప్రయత్నించడమూ కనీసమైన కర్తవ్యాలు.

విశాఖ మార్క్సిస్టు తన వాదంలో- "గాంధీగారిలాగా వ్యక్తిగత ఆదర్శవాదం వల్ల మనం గొప్పవాళ్ళ మనిపించుకోవచ్చు. కాని, అందువల్ల జనానికి ఒరిగిందే మిటి?"- అన్న మాటల్లో కూడా లక్ష రకాల తప్పులున్నాయి.

గాంధీకి అసలు వ్యక్తిగత ఆదర్శవాదం వుందా? వుందని (గాంధీకి వుందని) విప్లవ మార్క్సిస్టు ఒప్పుకుంటాడా? పోనీ, కాస్సేపు వాదం కోసం వొప్పుకుంటే, మార్క్సిస్టు సత్ప్రవర్తన గాంధీ ఆదర్శవాదం లాంటిది మాత్రమేనా?

'స్త్రీలని అవమానించ కూడదు' అనేది మార్క్సిస్టుకీ ఆదర్శమా? వెన్నెల కాయడం చంద్రుడికి ఆదర్శమా?— వెన్నెల కాయడం చంద్రుడికి ఎంత సహజమో, స్త్రీలని అవమానించరాదని భావించడమూ, బూతు మాటల్లోని దోపిడీ వర్గ సాంస్కృతిక స్వభావాన్ని గ్రహించటమూ మార్క్సిస్టుకి అంత సహజం,

స్త్రీలని అవమానించ రాదనేది ఒక నాస్తికుడికో, సంస్కర్తకో ఆదర్శం అవుతుంది— గానీ, మార్క్సిస్టు భావాలు గలిగిన వాడికి అది ఆదర్శం కాదు, అది అతని బాధ్యత. అతని కర్తవ్యం.

ఒక మార్క్సిస్టుకుండే బాధ్యత గాంధీ ఆదర్శవాదం లాంటిది ఎంతమాత్రమూ కాదు.

గాంధీకి ఆ వ్యక్తిగతాదర్శవాదం తప్ప ఇంకేమీలేదు.

మార్క్సిస్టు సంగతి అలా కాదు, అతనికి సమిష్టి కర్తవ్యం అనేది కూడా వుంది. ఆ సమిష్టి కర్తవ్యంలో అతి ముఖ్యమైన భాగం 'స్త్రీల విముక్తి'.

గాంధీ వ్యక్తిగతాదర్శవాదం సమాజ జీవితంలో ఎటువంటి మార్పుల్నీ తీసుకు రాలేదు. (అలా తీసుకు రాగలిగే స్వభావమే దానికి లేదు.)

మార్క్సిస్టుకి వుండే వ్యక్తిగత సత్ప్రవర్తనకీ, అతను సమాజంలో ఏమార్పులైతే తేవాలని ప్రజలతోకలిసి కొన్ని పనులు చేస్తున్నాడో ఆ పనులకీ, (అంటే సామాజిక కార్యాచరణకీ) తప్పనిసరిగా సంబంధం వుంది. ఒక మార్క్సిస్టు వ్యక్తిగత సత్ప్రవర్తన సమిష్టి కార్యాలనీ, సమిష్టి కార్యాలు వ్యక్తిగత ప్రవర్తననీ నిరంతరం ప్రభావితం చేస్తూనే వుంటాయి.

భారతదేశ ప్రజల 'దౌర్భాగ్యం'కొద్దీ మార్క్సిస్టు అనేవాడికి వ్యక్తిగత నీతి నియమాలు అక్కర్లేదనే నవీన మార్క్సిస్టులు గొప్ప విప్లవకారులుగా చలామణీ అవుతున్నారు. వ్యభిచారం చేసినా తప్పులేదు. విప్లవ మీటింగుల్లో తాగి తందనాలాడినా తప్పులేదు. ముగ్గురేసి పెళ్ళాలున్నా తప్పులేదు. నిమిషానికో అబద్ధం కూసినా తప్పులేదు. కట్నాలు తీసుకున్నా తప్పులేదు— చేసిన తప్పులకు నిజంగా పశ్చాత్తాపపడతాడా అంటే అదీలేదు. 'దోపిడీ, దోపిడీ' అని మీటింగుల్లో అరిస్తే చాలు, అయిపోతుంది అయిన కర్తవ్యం. ఆ దోపిడీని అరికట్టే వుద్యమాలు నడపడానికి ఎంత సిద్ధాంత జ్ఞానం, ఎంత నిజాయితీ, ఎంత క్రమశిక్షణ, ఎన్ని నీతి నియమాలు అవసరమో మాత్రం పట్టించుకునే పనిలేదు.

'గాంధీలాగా మడికట్టుకుంటే జనానికి ఒరిగిందేమిటి?'– అని ఉత్త బండతర్కం.

జనం అంటే ఎవరు? జనంలో అందరూ పురుషులే వుంటారా? స్త్రీలు కూడా వుంటారా? జనంతో స్త్రీలు కూడా వుండేటట్టయితే, వాళ్ళని 'అవమానించకుండా వుండే' చర్యలవల్ల వాళ్ళకేమీ ఒరగదా? తిట్టడమూ, తిట్టకపోవడమూ ఒక్కలాగే వుంటుందా స్త్రీలకి? అవమానించడమూ, అవమానించక పోవడమూ ఒక్కలాగే వుంటుందా ఎవరికైనా?

స్త్రీలకూ, స్త్రీల సంపూర్ణ విముక్తినికోరే పురుషులకూ వుత్సాహభరితంగా వుండే ఒక విషయం చెప్పాలి.

చైనాలో, భార్యల్ని తిట్టీ, కొట్టీ, అవమానపరిచే భర్తల్ని మహిళా సంఘ సభ్యులు అద్భుతంగా చితకబాదిన సంఘటనల్ని– జాక్ బెల్డెన్ రాసిన 'చైనా షేక్స్ ది వరల్డ్' పుస్తకం వుత్సాహంతో వర్ణించింది.

ఒక భార్య తన భర్త దుర్మార్గంతో విసిగిపోయి మహిళా సంఘానికి ఫిర్యాదు చేసింది. మహిళా సంఘ సభ్యులు ఆ 'భర్త'ని పిలిపించి "ఏమిటి నీ వ్యవహారం" అని అడిగారు. ఈ పురుషోత్తముడు– "నా పెళ్ళాన్ని నా ఇష్టమొచ్చినట్టు చేసుకుంటాను" అని జవాబిచ్చాడు. ఇక అప్పుడు మహిళా సంఘ సభ్యులు ఆ పురుషోత్తముడి చుట్టూ చేరి అతన్ని కింద పడగొట్టి తన్నడం మొదలెట్టారు. అతని బట్టలు చిరిగి పోయాయి. ఒళ్ళంతా రక్తాలు చిమ్మాయి. నేలంతా దొర్లి బురదలో దొర్లిన పందిలా అయ్యాడు. 'కొట్టకండి, కొట్టకండి' అని ప్రార్థనలు మొదలెట్టాడు. 'ఇకనించీ బుద్ధిగా వుంటాను' అని వాగ్దానాలు చేశాడు. అక్కడితో మహిళా సంఘ సభ్యులు చివరి హెచ్చరికలుచేసి వొదిలిపెట్టి దూరంగా నించున్నారు. ముఖం నిండా మట్టితో రక్తాలు కారుతూ పడివున్న భర్తని చూసి ఆ భార్య చెప్పలేనంత ఆనందపడింది– మహిళా సంఘ సభ్యులకు తన కృతజ్ఞతలు పదేపదే చెప్పుకొంది. 'కామ్రేడ్ సిస్టర్స్! మీ సహాయం లేకపోతే నేనీపని ఎన్నటికీ చెయ్యలేను. ఇతను ఈ రకంగా నన్ను ఎన్నోసార్లు తిట్టి, కొట్టి బాధించాడు. ఇతను ఇప్పుడు వున్న స్థితిలో నన్ను ఎన్నో సార్లు పడేశాడు. మీ సహాయం లేకపోతే నా ప్రతీకారం ఎన్నటికీ తీర్చుకోలేక పోదును. కామ్రేడ్స్! మీ అందరికీ నా ధన్యవాదాలు, నా ధన్యవాదాలు'– అని ఆనందంతో పొంగిపోతూ కృతజ్ఞతలు తెల్పుకుంది.

అవమానాలు భరించడం ఎవ్వరికీ సంతోషంగా వుండదు. గతి లేక భరిస్తూ వుంటారేగానీ, దారి దొరకినప్పుడు తప్పకుండా ప్రతీకారం తీర్చుకుంటారు. మార్క్సిస్టు

రచయితలు చేసే అవమానాన్ని కూడా స్త్రీలు భరించరని వారు చాలా తొందరగా గుర్తించడం మంచిది.

విశాఖ మార్క్సిస్టు వాదాన్ని ఏదో అమాయకపు వాదంగా తీసి పారెయ్యడానికి వీలులేదు. ఈ నాడు విప్లవ మార్క్సిస్టులమని విర్రవీగుతోన్న ప్రతీ ఒక్క గ్రూపు లోనూ సాంస్కృతిక విషయాలలో బ్రహ్మాండమైన సిద్ధాంతలోపం వుంది. స్త్రీల ప్రయోజనాలకు సంబంధించిన విషయాలనో, స్త్రీపురుషులకు సాంస్కృతికంగా విప్లవ చైతన్యం కలిగించే విషయాలనో మాట్లాడితే –" ఆ, అది ప్రధాన సమస్యా ? " అని తీసిపారేస్తూ వుంటారు. సాంస్కృతిక విషయాలు రాజకీయ విషయాలంత ప్రధాన సమస్యలు కావన్నమాట నిజమే. ప్రధాన సమస్యలు కాని వాటిని అసలు ముట్టుకో అక్కరలేదన్నంత అజ్ఞానం ప్రదర్శిస్తున్నారు 'విప్లవ'కారులు. ఒక ప్రత్యేక సందర్భం వచ్చినప్పుడైనా సాంస్కృతిక విషయాల గురించి చర్చించకపోవడం, లక్ష్యపెట్టక పోవడం పెద్ద జబ్బుగా వుంది అందరికీ. రాజకీయ చైతన్యానికీ, సాంస్కృతిక చైతన్యానికి తప్పనిసరి సంబంధం వుంటుందనే విషయాన్ని అర్థమే చేసుకోరు.

'స్త్రీలు నగలు పెట్టుకోవడం' గురించి 'ప్రజాసాహితి'లో 'చర్చా వేదిక' కు ఒక ప్రశ్న వస్తే – 'నగలు పెట్టుకోవడం అనేది దోపిడీ సంస్కృతికి సంబంధించినదే' అని నేను జవాబు ఇచ్చాను. దాని మీద కొందరు విప్లవ కారులనబడేవాళ్ళు, నేను నగలు మానెయ్యాలనే విషయాన్నే ప్రధాన సమస్యగా చేస్తున్నానని సంస్కరణ వాదం బోధిస్తున్నాననీ విమర్శలు చేశారు. సరిగ్గా అలాగే ఇప్పుడు కూడా– 'బూతు మాటలు' మానెయ్యాలన్నదే నేను ప్రధాన సమస్యగా చేస్తున్నాననీ, ఆదర్శవాదం బోధిస్తున్నాననీ– విమర్శలు చేస్తారనడంలో సందేహంలేదు.

సందర్భం వచ్చినప్పుడైనా ఒక సాంస్కృతిక విషయంమీద శాస్త్రీయమైన దృక్పథంతో చర్చించి సరైన అవగాహన ఏర్పర్చు కోవాలని గుర్తించరు. ఫ్యూడల్ సంస్కృతి నశించాలి అని పెద్ద పెద్ద కేక లేస్తారు, గోడలంతా రాస్తారు, ఏమిటీ ఫ్యూడల్ సంస్కృతి ? 'రంకులూ' 'లంజలూ' 'మాచికమ్మలూ' 'గొడ్రాళ్ళు' అలాగే వుండి, స్త్రీలకు జరిగే అవమానాలన్నీ అలాగే వుండి, ఇతర విషయాలో ఏది నశిస్తే మాత్రం స్త్రీలకేం పట్టింది ? ఏదో కొత్త సమాజం రావాలని స్త్రీ ఎందుకు కోరుకోవాలి ? దాని కోసం స్త్రీ లెందుకు పాటుపడాలి ?

పురుషునికి – ఆర్థిక, రాజకీయ, సాంఘిక దాస్యాలతో పోరాడవలసిన అవసరం మాత్రమే వుంది.

స్త్రీలకి – వాటితోపాటు, పురుషదాస్యంతోటీ, పురుషులు చేసే అవమానాల తోటీ కూడా పోరాడవలసిన అవసరం వుంది. (స్త్రీ పురుషుల్ని రెండు శత్రు శిబిరాలుగా చేసి వారి వైరుధ్యాల్ని రెచ్చగొట్టడం కాదు ఇది. వారి వైరుధ్యాల్ని పరిష్కరించు కోవడానికే ఈ ధోరణి తోడ్పడుతుంది.

అంతేగాక, సాంస్కృతిక సమస్యల్ని ప్రధానం చేయడం కూడా కాదు, ఇది వాటిని ఎంత మాత్రం నిర్లక్ష్యం చెయ్యకూడదని సూచించడమే ఇది.)

మాటల్లో విప్లవత్వం వల్లించి, చేతల్లో రివిజనిజం చూపించే అవకాశవాదుల్ని గుర్తించి, పోరాడలేని అజ్ఞానంలో స్త్రీలు ఎల్లకాలము వుండరు.

స్త్రీల విషయంలో మార్క్సిస్టు అయిన వాడు ఎలా వుండాలో అలా వుండక – సనాతన వాదులలాగే ప్రవర్తించే మార్క్సిస్టుల్ని గురించి లెనిన్ క్లారాజెట్కిన్‌తో మాట్లాడుతూ ఒక చోట ఇలా అంటారు – "కమ్యూనిస్టుని కదిపితే, 'సంసార్క భావాలు లేని బండ వాడు (ఫిలిస్టిన్)' అని, దురదృష్టవశాత్తు, మనం ఇంకా మన కామ్రేడ్లలో చాలా మందిని గురించి అనవచ్చు. నిశ్చయంగా, కమ్యూనిస్టుల్లో సున్నితమైన విషయాలను కదపవలసి వుంటుంది– స్త్రీల పట్ల వాళ్ళ మనస్తత్వాల లాంటి వాటిని."

విశాఖ మార్క్సిస్టు వుత్తరంలో 'ఉద్యోగపు బుద్ధి' కథ గురించి ఇచ్చిన అభిప్రాయం కూడా చాలా పొరపాటుగా వుంది. "స్త్రీ సమానత్వం మీద అంత మంచి కథ నేను విశ్వ సాహిత్యంలో చదవలేదు" అన్నారాయన. అది చాలా మంచి కథ అనడంలో ఏమీ సందేహం లేదు. కానీ ఆ కథ స్త్రీ సమానత్వాన్ని ప్రధానోద్దేశంగా చేసుకుని రాసింది కాదు. అధికార హోదాలో వుండే వ్యక్తి బుద్ధి ఎలా వుంటుందో చెప్పే కథ అది. 'తనిఖీకి వచ్చిన అధికారి పురుషుడైనా, స్త్రీ అయినా ఒక్కలాగే ప్రవర్తిస్తారు' అని చెప్పడమే ఆ కథ వుద్దేశ్యం. (స్త్రీ సమానత్వానికి సంబంధించిన అంశం ఆ కథలో అసలు లేదని కాదు. కానీ ఆ కథకి అది ముఖ్యం కాదు.)

వరదరాజులు అనే తనిఖీ ఆఫీసరు గుమాళ్ళ దంపతులమీద కేసు రాసుకుంటాడు ఆఫీసు పుస్తకంలో. వరదరాజులు భార్య (భర్తతోపాటు ఆమె కూడా ఆ గ్రామం వచ్చింది) గుమాళ్ళ దంపతులమీద జాలిపడి, భర్త చేతిలోంచి ఆఫీసు రికార్డు తీసుకుని ఆ కేసు కాయితం చింపేస్తుంది. భర్త ఆమెని తిట్టి, కొట్టినంత పనిచేస్తాడు. అదంతా గుమాళ్ళ దంపతులు చూస్తారు. వాళ్ళు వెళ్ళిపోయింతర్వాత– గుమాళ్ళామె భర్తతో– "అమ్మగార్కి తనిఖీ హోదా వస్తే మనమీద కేసులుండవు" అంటుంది.

అప్పుడు గుమాళ్ళాయన– "అప్పుడు ఆవిడా సింపేలయదు. వ్రాసుకొని దాసుకొంటుంది. అధికారమే అది"– అంటాడు. ఉద్యోగుల బుద్ధి ఎలావుంటుందో చెప్పడమే ఆ కథ ఉద్దేశం. కథ పేరే 'ఉద్యోగపు బుద్ధి'. (1978 జనవరి 'ప్రజాసాహితి' లో ఈ కథ మేము వేశాము. ఆసక్తి వున్నవాళ్ళు ఆ సంచిక చూడవచ్చు.)

నవల - సీరియల్

చౌ లి-పో

ఇంగ్లీషు నుంచి తెలుగు

నళిని



రెండవ భాగం

(జనవరి 1980,
99 సంచిక తరువాయి)

## 10

మీటింగు పూర్తయేక మహిళా సంఘాన్ని కలవటానికి వెళ్ళేడు కువో. పైన ఆకాశంలో చందమామ వెలుగులు, కింద నేలమీద వెండిలా మంచు మెరుపులు. జేబులో చేతులు పెట్టుకుని 'తు' యింటివేపు నడుస్తున్నాడు కువో; చెవుల్నికప్పే టోపీ పెట్టుకున్నాడు. 'తు' యింటి ఆడవాళ్ళు ఉత్తరపు భాగంలో వుంటున్నారు. మహిళా కార్యకర్తలు 'దుక్కముక్క'ని* చుట్టుముట్టేరు. ఆయుధాలు ఎక్కడున్నాయో ఆమెతో చెప్పించాలని ప్రయత్నం.

కువో తూర్పు గదిలోకి అడుగుపెట్టేడు. లోపల వెచ్చగా వుంది. అతను ఒక్క క్షణం ఆగేడు. చేటంత ముఖంలో చీమతలకాయంతేసి కళ్ళతో అటూ యిటూ చూస్తోంది 'దుక్కముక్క'. ఆమె చుట్టూ ఆడవాళ్ళున్నారు. కొందరు కాంగుమీద కూర్చున్నారు; ఒకామె పిల్లకి పాలిస్తోంది, మరొకామె పైపు కాలుస్తోంది. నెలలు నిండిన ఒకావిడ ఇద్దంచోటు ఆక్రమిస్తూ కూచుంది. తిన్ తాత భార్య ఒక బెంచిమీద కూర్చుని అన్ని కబుర్లు వింటూ నులకపేనుతోంది. ఆమె వెనక చావో భార్య తన కొడుకు సోంచు మీద చేతులేసి నిల్చుంది. పాయి భార్య, లీకీ-లాన్ 'దుక్కముక్క' సంగతి చూస్తున్నారు. లీకీ-లాన్ కువో రావడం చూసీచూడనట్టు వూరుకుంది. పాయి భార్య అతని దగ్గర కొచ్చింది.

"బతిమాలీ బామాలీ సివరికి ఒప్పించేను కూడా. కాని తెల్దంటే తెల్దంటున్నాది" అంది పాయి భార్య.

పైపు కాలుస్తూ 'దుక్కముక్క' దగ్గరికెళ్ళేడు కువో.

"నీకంతా తెల్సునట. నీకేటి తెలుసో మాకు సెప్పు. మాకు మేంవే అయుధాలు కనుక్కుంటే నీకు సికాకై పోతాది" అన్నాడు కువో.

ఇతని ధోరణి వేరుగా వున్నట్లనిపించి 'దుక్కముక్క' ఓసారి తేరిపార చూసింది.

---

* 'తు' పెద్దకోడలు.

"నేను చెప్పినా మీకక్కడ ఏఁవీ దొరక్కపోతే ?"

"నీకు తెల్సిందంతా సెప్పు. అక్కడేవీ లేకున్నా నిన్నేటనం" అన్నాడు కువో నోట్లోంచి పైపుతీస్తూ. ఆవిడ మళ్ళా మనసు మార్చుకుంటుందేమోనని "నీకు తెలిసీ సెప్పఁపోతే నీకు సిక్కే. పెబుత్వం నిన్ను జైల్లోకి నెట్టీగల్దు. అందుకే అంతవరకు రాకుండా సూస్కో."

"మరి అన్నీ చెప్పేసేనని మా మాఁవగారు కొడితేనో ?"

"ఆడు యింకేటీ సెయ్యనేడు" అన్నాడు చూ.

"మహిలా సంగం వున్నాది కదా, మాఁవే సూసుకుంతాం. ఆడు నీమీద సెయ్యి కాదు, ఏలేసినా నీకాల్లమీద పడేత్తాం. ఆడు మరి నువ్ నెగమనేదాకా నెగడు" అంది పాయి భార్య అందమైన కనుబొమలు ముడుస్తూ.

"పాయి భార్య సెప్పింది సేసేత్తాది" అన్నాడు ఓల్డుసన్.

'దుక్కముక్క' పాయి భార్యని ఓమారు పరికించి చూసింది.

"మీకంతా చెప్పేస్తే నన్ను మహిళా సంఘంలో చేరనిస్తారా ?"

"నువ్ నిజం సెప్తే సేరనిత్తాం. కాని నువ్ సేరకపోయినా నిన్ను బాగా సూసుకుంతాం" అంది పాయి భార్య.

"సరే చెప్తా" నంది దుక్కముక్క నిట్టూరుస్తూ.

'దుక్కముక్క' మరిది— 'తు' చిన్నకొడుకు— వూచియాలో 'దుక్కముక్క' అన్న ఇంట్లో రెండు రైఫిళ్ళు దాచేడు. ఆమె అన్న, మరిది ఓ రహస్య సంఘ సభ్యులు. ఆ కొత్త రైఫిళ్ళామె చూసింది. కాని వాటిని అన్న ఎక్కడ దాచాడో తనకు తెలేదు. ఇది వినగానే కువో ఓల్డుసన్‌ని స్లెడ్జి బండి తెమ్మన్నాడు. పాయి భార్య, లీకీ-లాన్, 'వూ', మరికొందరు స్త్రీలు, పిల్లలు గేటుకి కాపలా వుండి ఎవరూ రాకపోకలు జరక్కుండా చూడాలి. చాంగ్‌చింగ్-షీ రైతుసంఘంలో దాచిన జప్తు చేసిన సొమ్ముకీ వస్తువులకీ కాపలా వుండాలి. అన్ని జాగ్రత్తలు తీసుకున్నాక కువో, యిద్దరు సైనికులు, 'దుక్కముక్క', ఓల్డుసన్ స్లెడ్జిబండిలో వూచియా బయల్దేరేరు. వెళ్ళేముందు 'దుక్కముక్క' కొడుకుని చావో భార్యకి అప్పగించేడు కువో, ఆ చలి గాలిలో పసిగుడ్డుని తీసుకుపోవడం కుదరదని.

అది వెన్నెల రాత్రి, చుక్కలు నిండిని ఆకాశం; నేల, నింగి, చెట్లు పుట్టలు, మిట్టపల్లాలు అన్నీ ఏక తెలుపే. మంచు ఆ వెన్నెల్లో మెరిసిపోతోంది. గుర్రాలు

మూడూ దౌడుతీస్తున్నాయి. కారు పోయినంత వేగంగా పోతోంది స్లెడ్జి. కువో 'దుక్క ముక్క'తో మాటామాటా కలిపి నెమ్మదిగా తుపాకుల వూసెత్తేడు.

"తుపాకులున్న మాట నిజఁవే గాని, ఎక్కడున్నాయో నాకు కొంచెంగూడ తెలీదు. నాకు పెళ్ళయి మూడేళ్ళే అయింది, మా ఆయన నాకేఁవీ చెప్పడు" అంది.

కువో ఆవిడ తోడికోడలి ప్రసక్తి తేగానే రెచ్చిపోయింది. తోడికోడల్ని, ఆవిడ తాలూకు వాళ్ళందరిని తిట్టి దిగబారపోసింది. తోడికోడలి తలిదండ్రుల దగ్గర నుండి మగడిదాకా అందర్నీ పేరుపేరునా తిట్టింది. మరో రెండు మైళ్ళు దాటింది స్లెడ్జి, కాని ఆమె తిట్ల ప్రవాహం ఆగలేదు.

"నీ తోడికోడలికి తుపాకుల సంగతి తెలుసంటావేటి?" అన్నాడు కువో ఆమె కున్న కోపాన్ని చూసి.

'అదెలాపోతే నాకేఁ?' అనుకుని, "తెలిసే వుంటుంది. దాని మొగుడే దాచేడు తుపాకులన్నీ. దానికి చెప్పే వుంటాడం"ది.

స్లెడ్జి వూచియాలో 'దుక్కముక్క' అన్న ఇంటిముందు ఆగింది. కిటికీలు, తలుపులు బిడాయించివున్నాయి. తలుపు కొట్టిన చాలాసేపటికి లోపల దీపం వెలిగింది. 'దుక్కముక్క' అన్న కాంగ్‌సిగి బట్టలు సర్దుకున్నాడు, 'దుక్కముక్క' అతనితో మెల్లగా మాట్లాడింది. అతను కువోకేసి తిరిగి "సరే చూపిస్తాను రండి" అన్నాడు.

'దుక్కముక్క'ని, ఓల్డుసన్‌ని యింట్లోనే వుంచి కువో, సైనికులిద్దరు 'దుక్కముక్క' అన్నతో ఓ అడివిలోకి* దారితీసేరు. బాలసూర్యుడి కిరణాలు మంచుమీద పడి కళ్ళు జిగేలుమంటున్నాయి. ఓ మైలు నడిచేక చిన్నగుట్టదగ్గర ఆగేరు. అక్కడ పడిపోయిన చెట్టుకింద 'దుక్కముక్క' అన్న మెత్తటి మంచుని కాలుతో పక్కకితోసేడు. పసుప్పచ్చ ఆయిల్ క్లాత్ బైటపడింది. సైనికులు దాన్ని పైకితీసి అందులోని మూట విప్పేరు. రెండు కొత్త 99 ఎం.ఎం. రైఫిళ్ళు. తుపాకి పట్టుకునే చోట కోడి కొవ్వుంది. గొట్టం తుప్పు పట్టింది. ఆ దగ్గర్లోనే మరోచోట యాభై రౌండ్లకి సరిపడ తూటాలున్న పెట్టె తీసేడు దుక్కముక్క అన్న.

అందరూ మళ్ళీ స్లెడ్జి ఎక్కి యువాన్ మావోకేసి ఆనందంగా సాగిపోయేరు. కువో 'దుక్కముక్క'కి కబుర్లు చెప్తుంటే సైనికులు పాటందుకున్నారు, 'కమ్యూనిస్టు పార్టీ లేకుంటే నవచైనా లేనేలేదు'.

---

* Pine Wood

"ఇంకా ఎదురు తిరుగుదాఁవని తుపాకులు దాసేసినారు దొంగ నాయాల్లు ఉప్పుడేటి సేత్తారో" అన్నాడు ఓల్డుసన్ కొరడా ఝుళిపిస్తూ.

ఊరు చేరుతూండగా ఇళ్ళమీద పొగ కనిపించింది– ఉదయపు వంట అప్పుడే మొదలయిందన్న మాట. గాలి లేక పొగ ఒక్కొక్క ఇంటిమీద నుంచి లేస్తున్న తెల్లటి స్తంభాల్లా వున్నాయి. అవి ఆకాశాన్ని తాకేందుకు పైపైకి పెరుగుతున్నట్టున్నాయి. రైతు సంఘం ఆఫీసు చేరేసరికి చాఁగ్‌చింగ్–షీ ఇంకా నిద్రపోతున్నాడు. స్లెడ్జి శబ్దానికి లేచి తుపాకులు కిందికి దింపేడు. ఓల్డుసన్‌ని. సైనికులను నిద్రి పొమ్మని యిళ్ళకు పంపేడు కువో. అతను మాత్రం నిద్రపోకుండా 'దుక్కముక్క'తో కలిసి 'తు' ఇంటికి వెళ్ళేడు.

"చైర్మన్ కువో, నాకింకో మొగుడు దొరుకుతాడంటావా? నా మొగుడు వెళ్ళిపోయి రెండేళ్ళవుతోంది. ఏ కబురూ లేదు" అంది కువో పక్కనే నడుస్తూ. కువో ఏఁవీ వులకలా, పలకలా– ఆమెకేసి చూడనైనా చూడకుండా వడిగా నడవసాగేడు. అంతే, ఆమె నోరు మూతబడిపోయింది. ఇల్లు చేరేక 'గడకర్ర' చేత తుపాకుల ఆచూకీ బయట పెట్టించేందుకు మధ్యాహ్నం వరకు తిప్పలుపడింది 'దుక్కముక్క'. కాని ఒక్కముక్క కూడా రాబట్టలేక పోయింది. పాయిభార్య, లీకీ–లాన్ రాగానే 'గడకర్ర' సంగతి వాళ్ళ కప్పజెప్పి, 'దుక్కముక్క'ని బైటికిపంపేడు కువో. మరో గంటలో ఆవిడకూడా అంతా చెప్పేసింది. పెరట్లో కట్టెలకింద వెదకమంది. రెండు, మూడు వందల మంది కలిసి ఆ కట్టెలను కిందకు దించేరు. అట్టడుగున ఓ 28ఎం.ఎం. 'మాసర్'[1] దొరికింది. కాని 'స్ట్రియికర్'[2] తూటాలు దొరకలేదు. పాయి భార్య 'గడకర్ర' నడిగి చూసింది. కాని తన కింకేఁవీ తెలీదని, తన మాఁవ నడగమంది.

కువో, మరికొందరు ఆక్టివిస్టులు 'తు'ని మరోసారి కదిపేరు. కొద్ది గంటల్లోనే అతనూ చెప్పేసేడు. స్ట్రియికర్, తూటాలు ఓ టంగ్‌నూనె[3] సీసాలో వున్నాయి. ఆ సీసా ఉత్తరపు గేటు దగ్గర ఓ గుట్టకింద పాతిపెట్టి వుంది. 'చూ' మరి కొందరు ఆక్టివిస్టులు 'తు'ని అక్కడికి తీసుకెళ్ళి దాన్ని పైకితీసి పగలగొట్టేసరికి నూనె పైకి చిమ్మింది. స్ట్రియికర్, పాతిక తూటాలు బైటపడ్డాయి.

---

1 Mauser - high powered repearing magazine - rifle or pistol.

2 Striker – Firing pin. (అను)

3 టంగ్‌నూనె – చైనా, మరికొన్ని దేశాలలో పెరిగే 'టంగ్' చెట్టు పప్పుల నుంచి ఈ నూనె తీస్తారు. పసుపురంగులో వుండే యీ నూనె విషం. (అను)

తర్వాత ఎక్కడెక్కడో పాతిపెట్టిన రైఫిళ్ళు, మౌసర్లు, తూటాలు ఒకదాని తర్వాతొకటి దొరికేయి.

ఈ గుట్టంతా బయటపెట్టేక 'తు' ఓ గుట్టమీద విచారంగా కూర్చున్నాడు. జనంచూపులు తప్పించు కోవడానికి టోపీ కళ్ళమీదకు లాక్కున్నాడు. ఊళ్ళోకి తిరి గొస్తూ అందరూ కులాసాగా నవ్వుతూ తుళ్ళుతూ వస్తోంటే అతను మాత్రం మౌనంగా నడిచేడు. ఎవరయినా పలకరించినా సమాధానం చెప్పలేదు. ఉన్నట్టుండి "నాకంతా అయోమయంగావుంది, పిచ్చెక్కి పోతుంది" అని గొణుక్కుంటూ ఏడ్చేడు.

ఉత్తరపు గేటు చేరగానే గుర్రం మీద చాంగ్‌చింగ్-షి వచ్చి కువోతో "ఆల్లు మనకి పంపిణీ సెయ్యడానికొచ్చేరు!" అన్నాడు రొప్పుతూ.

"ఎవరు? ఏవూరోల్లు? ఎక్కడున్నారు?" అన్నాడు కువో తికమక పడుతూ.

"మిన్సిన్ వూరోల్లు. రైతుసంగం ఆపీసులో వున్నారు"

కువో మిగిలిన జనాన్ని వదిలి చాంగ్ చింగ్-షితో వెళ్ళిపోయేడు. కువో ఇంతకు ముందోసారి 'పంపిణీ' గురించి విన్నాడు. ఒక వూరి పేదరైతులు, కంబార్లు మరోవూరెళ్ళి అక్కడి భూస్వాముల ఆస్తిపాస్తులుస్వాధీనం చేసుకోవడంలో సాయపడి, అందులో కొంతవాటా తీసుకునేవారు. కాని యువాన్‌మావోకి అలాంటి సాయం అవసరం అవుతుందనుకోలేదు కువో. రెండు తరాలుగా యీ వూళ్ళోనే వున్నప్పటికి 'తు' దగ్గర ఆయుధాలున్నాయని తనకి రూఢిగాతెలీదు. 'తు' కోడలే గనక బైటపెట్టక పోతే అవి ఎప్పటికీ దొరికి వుండేవి కావేమో! స్థానిక విషయాలు తనకే సరిగ్గా తెలి యకపోతే, పక్క వూరివాళ్ళకి అసలే తెలీవు. వాళ్ళు తప్పులు చేయకుండా పంపిణీ ఎలా చేయగలరు?

రైతు సంఘం ఆఫీసు గేటు బయట ముప్ఫయి స్లెడ్జిల వరకు వున్నాయి. గేటు లోపల ఓ రెండు వందల మంది ఆడ మగ వున్నారు. ఓ ఎర్రజెండా కూడా తెచ్చేరు. డోళ్ళు, పెద్దగంటలు వాయిస్తున్నారు. వీళ్ళ గురించి సియావోకి తెలియ దానికి ఓ సైనికుడిని సొంచియా పంపేడు కువో. తర్వాత నవ్వుతూ అతిథులకేసి తిరిగి "లోపటికి రండి, అత్తల మరీ సలిగున్నాది" అని ఆహ్వానించేడు.

అందరూ వుత్తరపు భాగంలో సర్దుకున్నారు. ఆవూరి పేదరైతు, కూలీలు యీ పంపిణీదార్లు ఎలా వుంటారో చూడ్డాని కొచ్చేరు.

---

* House Cleaning

మిన్‌షిన్ పూరి లీగ్[1] లీడరు కువోతో మాట్లాడేడు.

"మీరు ఇంకా తాంగ్[2] ఆస్తి గుంజుకోలేదని ఇన్నాం, ఆదికి మా పూల్ల మంచి బూఁవున్నాది. మమ్మల్ని చెండుకు తిన్నాడు. అందుకే మీకు పంపినీలో సాయం సేద్దాఁవని వచ్చేం. మీకు యిప్లవ పరంగ మంచి పేరున్నాది గనక మీరు బుగతలని కాపాడరమ కుంతన్నాం."

ఆఖరి మాట కువోని పొడిసినట్టయింది. తల దించుకున్నాడు. గుండె జారిన ట్టయి మాట పెగల్లేదు. కువో తీరే అంత, అతనికి వుద్రేకమొచ్చినా, కోపమొచ్చినా ఇలాగే మూగవాడయిపోతాడు. ఇతని సంగతి గ్రహించి 'తు' ముందు కొచ్చి,

"బుగతల్ని ఎవులు కాపాడినారు?" అని అడిగేడు.

మిన్షిన్ లీగ్ లీడర్ వెనక నించి ఓ పొడుగాటి తల బయట కొచ్చి "మరి 'తాఁగ్' నొగ్గీసిందెవరేటి?" అనడిగింది.

ఇప్పటికి కువో తేరుకుని "ఆడిపనే సూత్తన్నామిప్పుడు "అని జవాబిచ్చేడు.

మిన్‌షిన్ పొడుగుతల "పెద్ద కావందు నొగ్గీస్తారా? ఓ పెద్దోడికి అడ్డుపడ తారా?" అని మళ్ళీ అరిచేడు.

ఉఁచియాలో తవ్వి తీసిన తుపాకులు చాంగ్‌చింగ్-షి అందరికీ చూపించి "కావందుల్ని కాపాడేఁవంతారా? అలగయితే యివన్నీ ఏడనించి ఒచ్చేయి?" అని అడిగేడు.

ఓల్డ్‌సన్ మొదట యీ జనప్రవాహాన్ని, ఆస్లెడ్జిలను, తుపాకులను, ఈటెలను చూసి జడుసున్నాడు. 'పంపిణి' అంటే మంత్ర వైద్యుడుని పిలిచి దయ్యాన్ని వది లించడం లాంటి దనుకున్నాడు. యువాన్‌మావోలో ఏదో పొరపాటు జరిగితే వీళ్ళని పై అధికారులు పంపేరను కున్నాడు. అంత వరకు అందరి వెనక నక్కేడు. కాని కువోతో పాటు చాంగ్‌చింగ్-షీ కూడా జంకకుండా వాళ్ళతో మాట్లాడ్డం చూసి ధైర్యం తెచ్చుకుని ముందుకు తోసుకెళ్ళేడు. చాంగ్‌చింగ్-షి వెనక నిల్చుని తల మాత్రం ముందుకి పెట్టి మినిషిన్ నాయకుడిని "నువ్వేనా లీగ్ లీడర్ చెన్‌వి? 'పంపిసీ' అని ఎందుకంటావ్ నువ్వు? మాఁవు 'తు' ఇంటో బుద్ధుడి బొమ్మ తుక్కు తుక్కు సేసీసినం. నువ్వేటింకా బూజు బావాలతో పంపకాల గురించి మాటాడ తావ్? మాకన్నా ఎనకే వున్నారేటి మీరు?" అని అరిచేడు.

---

1 పేద రైతుల, రైతుకూలీల లీగ్

2 దుష్టత్రియంలో ఒకడు

ఇక అల్లరయేలా వుందని చెన్ చెయ్యిపట్టుకుని ప్రైట గదిలోకి లాక్కుపోయేడు కువో. తన మొలలోని పైపుతీసి పొగాకు నింపి వెలిగించి చెన్‌కిచ్చేడు. ఇద్దరు మునుపు జిల్లా మీటింగులో కలిసేరు. మంచి స్నేహితుల్లా మాట్లాడుకోసాగేరు. కువో అసలు విషయం కదిలిస్తూ–

"మీరు మాకు సాయంసేయనొచ్చేరు. బాగానేవుంది. కాని మావూరి అనుపానులు మీకు ఎరికనేవు గనక తప్పులు సేత్తారేఁవోనని మా బయ్యిం" అన్నాడు.

"అయితే మన రెండూల్లు కలిసి ఎలా పనిసేయాలో ఓ మీటింగులో తెల్సుకుంటే పోద్ది" అని చెన్ అంటే కువో ఒప్పుకున్నాడు.

బయట ఎర్రజండాలు రెపరెపలాడుతున్నాయి. డప్పులు, గంటలు మోగుతున్నాయి. మిన్‌షిన్ వూరివాళ్ళ ఎర్రజండా ఆఫీసు కప్పుమీద ఎగురుతోంది. యువాన్ మావో జనం తమ ఎర్రజండా ఓ వడ్లపురిమీద ఎగరేసేరు. మిన్‌షిన్‌వాళ్ళ గంటలు, డప్పులకు తోడు యువాన్ మావో వాళ్ళు గర్వంగా ఓ బూర కూడ వూదుతున్నారు. ఈ వూరి ఆడవాళ్ళు మిన్‌షిన్ ఆడవాళ్ళను పడఁవటి గదిలోకి తీసుకెళ్ళి చలిమంట పేసేరు. అందరూ చలికాగేక మిన్‌షిన్ ఆడవాళ్ళు వీళ్ళని పాట పాడమన్నారు. లీకీ–లాన్ కాంగుమీదకెక్కి–

"పోరాడినకొద్దీ బలపడతాం" అనే పాట మొదలెట్టింది, అందరూ అందుకున్నారు. పాటయిపోయేక మిన్‌షిన్ వాళ్ళని పాడమని అడుగుతూండగా కువో వచ్చి తూర్పుగదిలో మీటింగుందని చెప్పేడు.

కువో కాంగ్‌మీద నిల్చుని యువాన్‌మావో వూరివాళ్ళని వుద్దేశించి మాట్లాడేడు: "మనకి సాయపడ్డానికి మిన్‌షిన్ రైతుకూలీలొచ్చేరు. ఆల్లకి స్వాగతం సెప్దామా?"

"స్వాగతం" అని వంద గొంతులరిచేయి.

"మరి ఆల్లొచ్చినందుకు ఆల్లకి మనం ఏం సాయం సేద్దాం?" ఈ ప్రశ్నకి ఎవరూ తయారుగా లేరు. అంతా నిశ్శబ్దం ఇంతలో దూరం నుంచి ఓల్డ్‌సన్,

"మనం కూడా ఆల్లూరెల్లి పంపిసీలో సాయం సేద్దాం," అని అరిచేడు.

అందరూ గొల్లు మని నవ్వేరు మిన్‌షిన్ అతిధులు కూడా నవ్వు ఆపుకోలేకపోయేరు. కువో కూడ నవ్వుతూ

"అదక్కర్నేదులే, మనకన్నా మిన్షిన్ వూరోల్లే ముందున్నారు. ఇక్కడ 'తాంగ్' పని పట్టడానికొచ్చేరు. కాని మనం ఆడి ఆస్తి రెండుమార్లు పంపిసీ సేసేం. ఇంక

కొంచెం ఆస్తి మిగిలిపోనాది. ఇయేల సలిగున్నాది. ఈల్లింకా శానాదూరం ఎల్లాల. అందుకని 'తాంగ్' కాడ మనం గుంజుకున్న ఆస్తిలో యీల్లకి కొంత వాటా ఇవ్వా లంతాను. మీరేటంతారు? 'తాంగ్'కి మిన్షిన్‌లో కూడా బూవులున్నాయి. ఆడు యీల్లని కూడా దాదలెట్టీసినాడు. మరి ఈల్ల కేటిద్దాంవంతారు?" అని అడిగేడు.

"రెండు పెద్ద పెద్ద కట్టెల మోపులు" అన్నాడు 'చూ'

వెంటనే మిన్‌షిన్ పొడుగు తలవాడు,

"మీకేంవో ఎండీ బంగారంవూ, మాకు కట్టెల మోపులూనా? తౌన మీకు తొక్క మాకు? గుజ్జు మీకు, గింజలు మాకూనా? బాగున్నాది యవ్వారం" అన్నాడు.

మళ్ళి గోల మొదలయింది. వాదులాడుకో సాగేరు.

"యువాన్ మావో తమ్ముళ్ళకీ సెల్లెళ్ళకీ బుగతల్ని కాపాడొద్దని సెప్తుండాం" అన్నారు మిన్‌పిన్ స్త్రీలు.

పాయి భార్య కోపంతో వుడికిపోతూ కాంగ్ మీదకెక్కి,

"మాం తుపాకులు బైటపెట్టినాం- అదేనేటి బుగతల ఎన్ను కాయడం?" అని అరిచింది.

"తాంగ్ ఆత్తంతా బైటికి లాగుతాం. మీరంతా సాయంసేయండి" అన్నారు మిన్‌షీన్ స్త్రీలు.

పాయి భార్య మళ్ళీ ఏదో అనబోయి, కువో సైగ చేయడంతో వూరుకుంది.

కువో లేచి, "తగూలాడకండి. పేదోల్లంవంతరం ఒకటే! మనం తగూల్లే కుండానే అన్నీ తేల్సుకోగలం. మన పనుల్సాసి బొర్రిబొజ్జ బుగతలు నవ్వకూడదు. పెపంచికంవంతా పేదోల్లదే. మాం గుంజుకున్న దాంటో మీకూ వాటా యిత్తాం. మీకు పశువులమేత కావాలంటే తాంగ్ యింటో రెండు గడ్డిమేటులు, రెండు మూడొందలా చిక్కుడు అచ్చులు తీసుకోండి. అయి రైతుసంగానివే కాని మీకు కావాలంటే తీసుకోండి." అన్నాడు.

తర్వాత మిన్‌షిన్ లీగ్‌లీడరు కూడా లేచి,

యువాన్‌మావో పేదోల్లు మిన్‌షిన్ పేదోల్లని సొంత అన్నల్లా సూసుకుంతన్నారు. ఆలు కష్టపడిసంపాయించి దాంటో మనకి పెద్ద వాటా ఇత్తుండారు. మనం తీసుకోవాలంటారా, ఒద్దంటారా?" అని అడిగేడు.

"ఒద్దొద్దు" అని ఏక కంఠంగా అరిచేరు మిన్‌షిన్ అతిథులు.

"ఒద్దు, తీసుకోవద్దు"

"అల కష్టపలం అలదే, మనకొద్దు"

మళ్ళీ వాళ్ళంతా నేస్తాలై పోయేరు. రెండు వూళ్ళ అక్టివిస్టులు కలిసి ఒక నిర్ణయానికొచ్చేరు – మిన్షిన్ జనం శీతాకాలం గడవడానికి ఓ గడ్డిమేటు, వంద చిక్కుడచ్చులు తీసుకుపోవడానికి ఒప్పుకున్నారు.

కువో బిగ్గరగా అందరికీ వినబడేలా మాట్లాడసాగేడు: "టీం లీడర్ సియావో కాడికి మనిషిని పంపేను. అతనిప్పుడే తిరిగొచ్చేడు. 'తాంగ్ ఆస్తి గురించి యువాన్ మావో పెజలే సూసుకోవాల. పంపిణీ హులాన్ జిల్లాలో వుపయోగపడినాది గాని మరెక్కడా పనిజేయకపోవచ్చు. కాని మెన్షిన్ పెజలు శానా మంచి మనసుతో యువాన్‌మావో పెజలికి సాయంవొచ్చేరు. అందుకని యిద్దరూ తగూలాడుకోరాదు. మిన్‌షిన్ నేస్తాలికి మంచి భోజనం పెట్టాల' అని సియావో కబురెట్టేడు. భోజనం రడీగున్నాది. మంచి తిండి నేదుగాని రొట్టి, జాము కావలసినంతున్నాది. మల్ల పొద్దూకిపోతాది. బేగి లెగండి" అన్నాడు.

భోజనాలయేక మిన్షిన్ జనం తాము తీసుకెళ్ళాల్సిన గడ్డి, చిక్కుడచ్చులు తమ స్లెడ్జిబళ్ళ కెక్కించేరు. యువాన్‌మావో జనంవంతా వాళ్ళకి వీడ్కోలు చెప్పడానికొచ్చేరు. డప్పులు వాయిస్తూ, గంటలు మోగిస్తూ, పాటలు పాడుతూ మంచు పడుతోంది. చలి ఎముకలు కొరుకుతోంది. హోరున గాలి, కళ్ళు తెరవనీయడం లేదు. కాళ్ళు బిగుసుకుపోతున్నాయి. ముఖంమీద, గడ్డంమీద పడిన మంచు అక్కడికక్కడే గడ్డకట్టుకు పోతోంది.

(ఇంకా వున్నది)

---

## కథా వేదిక

మేం అయిదుగురుం 1980 నుంచీ పత్రికల్లో వచ్చిన కథల్ని చదివి మేం మంచివి అనుకొనే కథల్ని ఎన్నికచేసి నెలనెలా పత్రికాముఖంగానూ, ఆయా రచయితలకి నేరుగానూ తెలియజేద్దా మనుకుంటున్నాం. ఈ 'మంచి' కథల్ని చివరికి సంపుటాలుగా తీసుకురావాలని ప్రయత్నం. ఈ ప్రయత్నానికి రచయితలూ, పత్రికలూ సహకరించవలసిందిగా కోరుతూ–

— రాచకొండ విశ్వనాథశాస్త్రి
అర్నాద్
కాళీపట్నం రామారావు
వివిన మూర్తి
అత్తలూరి నరసింహారావు– కన్వీనర్

అడ్రెస్ :
కన్వీనర్
5/37, సిరిపురం
ఆంధ్రా యూనివర్సిటీ
విశాఖపట్నం – 530 003

## 'ముందారిరాక్షసం'

రాచకొండ విశ్వనాథశాస్త్రి

రచయితలకి రాజకీయాల్తో సంబంధం ఉండకూడదని చాలామంది పెద్దలుచెప్పగా విన్నాను. ఏ రచనా కూడా ప్రచారాత్మకంగా ఉండకూడదని కూడా పెద్దలు చెప్పగా విని తలూపేను. పెద్దవాళ్ళేదైనా చెప్పేరంటే అది మన మంచికే కదా చెప్తారు!

కాని చైనా తగువుతో రచయితలంతా సంబంధం పెట్టుకోవలసిన అత్యవసర పరిస్థితి ఏర్పడిందనీ, రచనలు మంచి ప్రచారాత్మకంగా ఉండాలనీ కూడా తెలుసుకున్నాను. రచయితలు వృత్తిరీత్యా కదనరంగంలోకి దిగినా మానినా ప్రతి రచయితా కత్తివంటి కలంతో చెక్కిచెక్కి రాయాలనే పెద్దల సలహా విని మాత్రం ఉత్సాహంతో ఉప్పొంగిపోయేను.

కాని అంతలోనే చప్పబడిపోయేను. దానికి కారణం పెద్దల సలహాలో ఫోర్సు లేకపోవడం కాదు, నాలో పెద్ద లోటుండడం. నాకు బద్ధకం, అతి బద్ధకం ఎంతో హెచ్చు. ఏదైనా రాయడం అంటే కూడా బద్ధకం చేత రాయలేకపోతాన్నేను. బీదల గోల గురించీ, దీనుల కష్టాల గురించీ రాద్దామనే వుద్దేశంతో అతిబద్ధకంగా నేను కొన్ని బొక్కి కథలు రాసేను. సంఘంలో అనాథ జీవుల్ని వుద్ధరించడం చాలా వుత్తమమైన పని అంటూ నేనెన్ని 'మధ్యతరగతి' కబుర్లు చెప్పినా నామట్టుకు నాకు కాలుకదపకుండా, కందకుండా హాయిగా జీవితం వెళ్ళిపోతే బాగుండు ననిపిస్తుంది. చిన్నప్పణ్ణించి నా తర్ఫీదు అటువంటిది. నీలాటివాళ్ళు కష్టాల్లో వున్నపుడు నావంటి వాళ్ళు వచ్చి "They Pay you with their sympathy." వాళ్ళు సానుభూతి మాత్రం చెల్లించి వెళ్ళిపోతారు. అటువంటి వాళ్ళని నమ్మవద్దని బాస్వెల్‌గారికి జాన్సన్‌గారు సలహా యిచ్చేరు. అందువల్ల వాలుకుర్చీ కబుర్లగాళ్ళని నమ్ముకోకుండా కార్మికులు, కష్టజీవులు తమ కార్మికుల్నీ, కష్టజీవుల్నీ నమ్ముకోవడం మంచిదని నా అభిప్రాయం. పడక్కుర్చీలకీ, విస్కీ బుడ్లకీ, మంచి భోజనాలకీ, రోజుకో రంగుబట్టకీ మోజుపడే నాయకులు నాలాగే న్యాయాన్నీ, ధర్మాన్నీ, విప్లవాన్నీ వాలుకుర్చీలో కూర్చోమంటాడు. ధర్మోపన్యాసం యివ్వడానికి నేను చక్కా రిక్షాలో వెళ్ళి ధర్మోపన్యాసం యిచ్చిన తర్వాత చక్కా రిక్షాలో యింటికి తిరిగివస్తే అది నాకు సరదాగానే వుండొచ్చు, కాని దానివల్ల రిక్షావాడి బాధలు మాత్రం తీరవు. అందరూ సుఖంగా యింటి దగ్గర శాస్త్రాలూ, పురాణాలూ చదువుకుంటూ కూర్చుంటే వూరంతా బాగుపడిపోయి వీధులంట ధర్మం నాలుగు పాదాలా నడిచేస్తుందనుకోడం బుద్ధిపొరపాటు. నూటికి నూరుమందీ

చదువుకుని విజ్ఞాన సంపన్నులుగా వుంటోన్న అమెరికా దేశంలో అటార్ని జనరల్ బాబీ (కెనెడీ) గారి ధర్మశాస్త్రాలకీ, నీతి సూత్రాలకీ అక్కడ నీగ్రోల యమబాధలు మటుమాయమై పోవుగదా! అవి మటుమాయమవడానికి వాళ్ళంతా నడుంకట్టి రంగంలోకి దిగి తెగించి పోరాడవలసుంటుంది. వాలుకుర్చీ నాయకులు ప్రజల్ని గోతిలోకితోసేసి వాళ్ళు వెళ్ళి చక్కా వాలుకుర్చీల్లో కూర్చుని వేడి నిట్టూర్పులు జాలిగా విడుస్తారు. వాళ్ళు ఎవరికైనా గుర్తుంటే వుండొచ్చేమో గాని న్యాయమూర్తులుగా మాత్రం ఎవరికీ గుర్తుండరు. వాలుకుర్చీలంటే నమ్మకంలేనివాళ్ళూ, ఇష్టపడనివాళ్ళూ కాబట్టే బుద్ధుడూ, లెనినూ (మన ఇంట్లో పొట్టి శ్రీరాములూ) ధర్మవీరులుగా యిప్పటికీ అందరికీ జ్ఞాపకమున్నారు. తన మట్టుకు తాను సుఖంగా వుండదలచుకున్న వాడు కష్టాల్లో వున్న వాళ్ళకి నాయకుడిగా వుండకూడదు. ఉంటే, కష్టాల్లోవున్న వాళ్ళకి ఘోరమైన దేంజరుంది.

కాలు నొవ్వకుండా కుర్చీలో కూర్చొని కబుర్లు చెప్పడం, కథ వ్రాయడం అంటే నాకు ఇష్టం అని వప్పేసుకుంటున్నాను. చేస్తూన్న పాపం చెబితే పోతుందంటారు. అంచేత చెప్పేను. కాని ఒక పాపం అంటే మాత్రం నేను అట్టే సహించలేను. అది నాలో వుండకుండా వుండడానికి పాటుపడతాను. అదేమిటంటే మోసం. ఆ పని నేనుచేసినా ఎవరుచేసినా నాకు చాలా అసహ్యం. మోసాన్ని తోసి పారేసి నిజం చెబ్దామనే తాపత్రయం చిన్న దొకటినాకుంది అందుచేత, నా గురించి నిజం చెప్పేసుకోవడమే కాకుండా, ఇతరుల గురించి నిజం తెలుసుకొని చెప్పాలనే సరదా కూడా నాకుంది.

అందుచేత పెద్దలు చెప్పిన ప్రకారం రాజకీయ రచనా వ్యాసంగంలోకి నేను దిగలేక పోయినప్పటికీ వాలుకుర్చీలో కూర్చొని "రాజకీయాల గురించి తీరుబాటుగా ఆలోచిద్దాం" అని నేననుకున్నా అత్యవసర (పరిస్థితుల) సమయంలో. చైనావాళ్ళకీ మనకీ వున్న తగువు, చైనావాళ్ళకీ రష్యావాళ్ళకీ తగువుగా అకస్మాత్తుగా ముదిరి పోయింది. ఇదేమిట్రా అని నేనలా విస్తుపోయి చూస్తువుండగానే రష్యాలో "పడమటి వైపుకి" కిటికీలు తెరవడం, పిలుపుని పురస్కరించుకొని "ఫ్రెండ్లీగా దాడి" చేస్తూ మాస్కోలో అమెరికావారు ప్రవేశించడం, సంధులూ సంతకాలూ ఛలోక్తులూ చిరునవ్వులూ ప్రాక్పశ్చిమ శాంతియుత సహజీవనాలు, ఇటువంటివన్ని తృటికాలంలో జరిగిపోయేయి.

అది చూసి అంతా బావుందనే అనిపించింది మొదట్లో నాకు. కాని అంతలో నేనొక కొత్త సంగతి విన్నాను. అంత వరకు—

కమ్యూనిజం వేరు కాపిటలిజం వేరు అనే అభిప్రాయంతోనే పెద్దలంతా వున్నారని నేననుకొంటూ వచ్చేను. కాని మొన్నయీ మధ్య "ఆ రెండూ కలగాపులగం చేస్తే మించి పోయింది మరేంలేదనే" కొత్త సంగతి విని నా చెవుల్ని నేనే నమ్మలేక పోయేను. "ప్రపంచం అరక్షణంలో ఎంత ముందుకు పోయింది!" అని ఓ క్షణం ఆశ్చర్య పోయేను.

కాని, అంతలో, నాలో కొన్ని అనుమానాలు తలెత్తాయి. పులులు మనసులు మార్చేసుకున్నాయి కాబట్టి చలితోవున్న మేకలకి పులి కడుపులు వెచ్చగా వుంటాయని చెప్పడం నాకు ఆశ్చర్యం కలిగించింది. ప్రపంచం ఎంత మారిపోయినప్పటికీ దోచుకునే దొంగలకీ దోచుకోబడే బీదజనానికీ మధ్య ఏ తేడా లేనంతగా మారిపోయిందంటే మాత్రం నేను నమ్మలేకపోయేను. అందుచేత, అందరూ ఇంత కొత్తగా మారిపోయిందంటూన్న యీ రాజకీయ ప్రపంచం గురించి కొంతయినా తెల్సుకోవాలనే వుద్దేశంతో హిష్టరీ పుస్తకాలు తిరగెయ్యడవూ, న్యూస్ పేపర్లు రోజూ చదవడవూ ప్రారంభించేను.

ఈ సందర్భంలోనే నేను టిటోగారి పేరు తరచు వినడం తటస్థించింది, అదివరకు ఆయన గురించి నేను అప్పుడప్పుడు వినకపోలేదు. కాని, ఎవరో, ఏంటో. ఎక్కడో, మనకేం సంబంధం? పెన్‌గ్విన్లూ, పోలార్ బేర్లూ, ఎస్కిమోలూ, అమెరికన్ కెకెకెలూ— అటువంటి విషయాల గురించి విన్నట్టే ఆయన గురించీ విన్నాను. ఆ భోగట్టాల గురించి వింటాం, చదువుతాం, ఆ వెంటనే మర్చిపోతాం, అంతకుమించి మరేం వుండదు.

కాని—

పులుల మనసులు మారిపోతున్నాయనీ గోవులకీ, గొర్రెలకీ కూడా దుర్మార్గబుద్ధి వుండకపోదనీ, అందుచేత వాటికీ వీటికీ తేడాలేదనీ అందరూచెప్పే సందర్భంలో టిటోగారిపేరు విని ఆయన ఎవరో తెల్సుకోవాలనే కుతూహలం నాక్కలిగింది. మొదట్లో ఆయన నెవరో 'పార్వెను' (పునాది లేకుండా పైకొచ్చినవాడు, చెడి బతికినవాడు, అప్‌స్టార్ట్) అనుకున్నాను. కాని ఆయన పార్వెనూ కాదు, సడెన్‌గా తెరతీసుకు ముందుకి వచ్చుండొచ్చు కాని తెరవెనక ఆయనకి చరిత్రవుంది. ఆయన గురించి నేను సంపాదించిన భోగట్టా సారాంశం ఏంటంటే,

యూరపు ఖండంలో యుగోస్లేవియా అనే దేశం వుంది. అది 'సోషలిస్టు' దేశమేట కాని రష్యా అంటే పడిచచ్చిపోకుండా కాపిటలిస్టు దేశాలతో కూడా చక్కని

స్నేహం గల దేశమట. ఆ దేశానికి అమెరికావాళ్ళు అప్పులిచ్చి మదుపులు పెడుతూ దాన్ని చాలా మోజుతో చూసుకుంటారుట. కాని అది అటు కమ్యూనిస్టు శిబిరంలోనూ చేరకుండా యిటు నాటో కాంపులోనూ కలియకుండా అతి మంచి తటస్థ దేశంగా వుంటోందిట. ఏ అంపటాలూ లేకుండా ఏ తంటాలూ తెచ్చుకోకుండా ఎవరి కాపరానికీ నిప్పు పెట్టకుండా అందరితోనూ కలివిడిగా వుంటూ తన కాపరాన్ని చక్కగా సరిదిద్దుకుంటోందిట. అటువంటి మూడు పువ్వుల ఆరుకాయల దేశానికి మార్షల్ టిటో అధ్యక్షులనీ, 'శాంతియుత సహజీవన' సూత్రాన్ని ఆయన తన పంచప్రాణాలతో సమానంగా చూసుకొంటారనీ తెలుసుకొని సంతోషించేన్ను.

అంతా చాలా బాగానే వున్నదనిపించింది నాకు. గాని తటస్థంగా వుంటూ 'శాంతియుత సహజీవనాన్ని' కాంక్షిస్తూ విశ్వశాంతికోసం టిటోగారు ఏ విధంగా పాటుపడుతున్నారో తెలుసుకోవాలనిపించింది నాకు. పుస్తకాలు తిరగెయ్యగా యీయన గురించి ఓ గమ్మత్తయిన భోగట్టా దొరికింది నాకు. అదేమిటంటే:

మార్షల్ టిటోగారు, 'ఇదుగో ఈ వ్యక్తి తూర్పు యూరపు దేశాల్లో ప్రజాస్వామ్య విధానాలు రావడం కోసమూ, రష్యాలో మార్పులు తేవడం కోసమూ, అటువంటి విషయాల గురించి గడచిన కొన్ని సంవత్సరాలుగా తనమట్టుకు తాను లేక, 'తనకి తోచిన విధంగా' పెద్ద ఆర్భాటం లేకుండా పనిచేస్తున్నారు. ఆ వ్యవహారాల్లో ముఖ్యమైన పాత్ర వహించేరు. ఆయనకి ఆ దేశాల నాయకుల్తో అతిమంచి పరిచయం వుంది. వారి భాషలో ఆయన మాట్లాడగలరు. మాట్లాడినపుడు మధ్యన దుబాసీలు వుండనక్కర్లేదు.' (భారత విదేశాంగవిధానం. ఇంగ్లీషు ప్రతి. పేజీ 582 లోక్‌సభలో తే. 20-11-1956. దీన్ని ప్రధానమంత్రి నెహ్రూగారు చెప్పేరు.)

'అందుచేత ఈయన అంచనా సహాయకరంగా వుంటుంది.'

లోక్‌సభలో 20-11-1956 తేదీన ప్రధానమంత్రి నెహ్రూగారు చెప్పిన యీ వాక్యాలు నేనోసార్చదివి మరోసార్చదివి ఇంకోసారి జాగ్రత్తగా చదివేను. చదివి, పుస్తకం పక్కన పడేసి వాలుకుర్చీతో సాగిలపడి కూర్చొని బర్కిలీ సిగరెట్టు ముట్టించి తీరుబాటుగా ఆలోచించడం ప్రారంభించేను.

తూర్పు యూరపు దేశాలంటే ఏవి? పోలండ్, హంగరీ, బల్గేరియా, రుమేనియా, జెకోస్లవేకియా, ఆల్బేనియాలు కదూ? అవి ఎటువంటి దేశాలు? కమ్యూనిస్టు దేశాలు. రష్యా ఎటువంటి దేశం? అది కూడా కమ్యూనిస్టు దేశమే. వాటినే, అనుకుంటాను, పీపుల్సు రిపబ్లిక్కులంటారు.

మరైతే, ప్రజాస్వామ్య దేశాలేవి? ముఖ్యంగా బ్రిటనూ, అమెరికా, ఫ్రాన్సూ, మనమూ, జపానూ, జర్మనీ కదా? మన దేశాల్ని కాపిటలిస్టు డెమోక్రసీలని పిలుస్తారని విన్నాను.

అయితే మన దేశాల్లోని 'ప్రజాస్వామ్య విధానాలకీ' కమ్యూనిస్టు దేశాలవలంబించే 'నియంతృత్వ విధానాలకీ' సరిపడదనీ చాలా తేడావున్నదనీ పండితులు చెప్పగా విన్నాను. అలా అయినప్పటికీ కూడా వాళ్ళూ మనమూ ఎవళ్ళ గొడవలు వాళ్ళం సరిచూసుకొంటూ ఒకరిజోలి కొకరం పోకుండా శాంతియుత సహజీవన సూత్రాలను పాటిస్తూ హాయిగా వుండడం అందరికీ మంచిదని కూడా నేను విన్నాను.

ఆ విధంగా హాయిగా వుండడం అదే మంచిదైతే అదే సుఖమైనదైతే మరి మనం టిటోగారి కార్యకలాపాల గురించి ఏమనుకోవాలి?

ప్రజాస్వామ్య దేశాల్లో పైవాళ్ళు కమ్యూనిస్టు విధానాలు ప్రవేశ పెట్టడం మంచిపనా చెడ్డపనా? విధానాలు మారడం మంచిదో చెడ్డదో ఏదైనప్పటికీ ఆ విషయం ఏదేశానికాదేశం నిర్ణయించుకోవడం మంచిదికాని ఒక దేశంలోని విధానాల్ని మార్చడానికి పైవాళ్ళు ప్రయత్నించడం మంచిది కాదని కదా మనం అనుకుంటున్నాం. చైనావాళ్ళు కమ్యూనిస్టులవనీయండి సోషలిస్టులవనీయండి ఎవరైతే కానీయండి. అలాగే అమెరికాలో అమెరికన్లంతా బంగారు కాపిటలిస్టులవనీయండి. వజ్రాల సోషలిస్టులవనీయండి. వాళ్ళజోలికి మరెవరూ పోకూడదని కదా మనం అనుకుంటున్నాం?

కాని, మరి యీ టిటోగారు ఎవరి వూసూ ఎత్తుకోకుండా తటస్థంగా వుంటామని చెప్పే మనిషి తటస్థంగా ఎందుకుండరు? తూర్పు యూరపు దేశాల్లో 'ప్రజాస్వామ్య విధానాలు' రావడం కోసం ఈయనెందుకు ప్రయత్నించడం? ఆ పనయినా ఆవిధంగా ఎందుకు చెయ్యడం? క్వయట్‌గా పనిచేయడం అంటే చడీచప్పుళ్ళేకుండా చాప కింద నీరులా వ్యవహరించడం అని కదా అర్థం? హంగెరీలో 'ప్రజాస్వామ్య విధానాలు' తీసుకురావడానికి ఆ మధ్య ఓ ప్రయత్నం జరిగింది. ఆ విషయంలో ఆర్భాటం ఏమీలేకుండా ఈయన చేసిన ప్రయత్నం ఏమైనా వుందా? ఉంటే, ఆ ప్రయత్నం ఏ రూపం దాల్చింది?

మరో సంగతి—

రష్యాలో మార్పులు రావడంకోసం కూడా టిటోగారు ప్రయత్నంచేస్తున్నారుట. మార్పులు రావడం మంచిదవొచ్చు చెడ్డదవొచ్చు. కాని రష్యాలో మార్పులు రావడానికి కృషి చెయ్యవలసిన బాధ్యత ఎవరిది? రష్యాలో ప్రజలదా లేక యుగోస్లేవియా

అధ్యక్షులదా ? రష్యాలో మార్పులు తేవడమనేది అది రష్యా ఆంతరంగిక వ్యవహారవాఁ ? లేక యుగోస్లేవియా గవర్నమెంటువారి స్వంతగొడవా ?

అయినా, టిటోగారి విదేశాంగ విధానం తటస్థ విధానం అవునా కాదా ? అది తటస్థ విధానమే అయినట్లయితే దానర్థం ఏవిఁటి ? ఇతర రాజ్యాల్లో అంటే పైదేశాల ఆంతరంగిక వ్యవహారాల్లో మార్పులు రావడం కోసం క్రియాటిగా ప్రయత్నం చెయ్యడవఁనా దానర్థం ?

ఈయనకి ఆ దేశాల భాష బాగావచ్చునట. ఆ దేశాల నాయకుల్తో మాట్లాడినప్పుడు మధ్యన దుబాసీగాళ్ళు వుండనక్కర్లేదట. దుబాసీ, ద్విభాషి, ఇంటర్ప్రిటర్ ట్రాన్స్‌లేటర్– ఇవన్నీ తర్జుమాదారుకి మారుపేర్లు. అంటే కృశ్చేవ్‌గారితోనో. మరెవరితోనో టిటోగారు మాట్లాడినప్పుడు పక్కన పిట్టమనిషైనా వుండక్కర్లేకుండా ఏకాంతంగా 'స్వేచ్ఛగా' మాట్లాడుకోవచ్చునన్నమాట. మూడోవాడి చెవిని పడకుండా అంత గుట్టుగా మాట్లాడుకునే పరమ రహస్యాలేఁవుంటాయి ?

పరమ రహస్యాలు వుంటాయే అనుకోండి. వాటి గురించి ఆ దేశాల నాయకుల్తో అంత గుట్టుగా మాట్లాడిన తరువాత ఆ గుట్టుమట్లన్నీ ఆయిన దాస్తున్నారా ? దాచినా మానినా ఆయన మాత్రం కొన్ని అంచనాలు వేసుకొంటారు.

ఆ అంచనాలు 'సహాయకరంగా' ఉంటాయట.

టిటోగారు వేసుకునే అంచనా ఎవరికి సహాయకరంగా ఉంటుంది ?

రష్యాకా, తూ.యూ.దేశాలకా. మనకా అమెరికా బ్రిటన్‌కా ? ఎవరికి ఆ అంచనాలు 'సహాయకరం'గా ఉంటాయా అంటే అలా ఉండడానికి వీలుగా ఆ ఇతరులకి ఆ అంచనాలని టిటోగారు అందజేస్తారనే కదా దాని భావం ?

అని ఇటువంటి ఆలోచనలన్నీ నా మనసులో మెదిలేయి. మెదుల్తాయి. పడక్కుర్చీలో కూర్చొని అలా రెండు బర్కిలీ సిగరెట్లు ఊదిపారేసేలోగా నాకు విసువుపుట్టి మనసు పాడవుతుంది. ఎవడెలాపోతే మనకేం కావాలి ? టిటోగారు ఏంచేస్తే మనకేటి ? ఏం చెయ్యకపోతే మనకెందుకు ? వార్సా పాక్టు ఉంటే ఎంత ఊడిపోతే ఎంత ? నాటో కూటమి బిగిస్తే మనకెందుకు ? కెనెడీగారు క్యూబా ఊబిలోకి దిగనీ మాననీ ! కృశ్చేవ్‌గారు కారల్‌మార్క్సుతో కుస్తీ పడితే పట్టనీ, పట్టలేకపోతే పోనీ ! కీలర్ కేసులో (మా)క్మిలన్‌గారు లజుగుజులు పడితే పడనీ, మానేస్తే మాననీ ! ఏ 'కే' ఏ 'కే'తో ఏ చిక్కులు తెచ్చుకుంటే మనకెందుకా గొడవ ? మనకేల ఆ ఊసు ?

మనపట్టుకు మనం హాయిగా ప్రేమమీదా విరహం గురించీ కథల్రాసుకుంటూ ఎంచక్కా ఎందుకుండగూడదు— అనే మధ్యతరగతివాళ్ళ మనోభావం నాక్కూ లుగుతుంది.

కాని 'తక్కువ్వేధవ మనసు' ఊరుకోదు. అందర్నీ స్టడీ చేయాలంటుంది. వారి భావాలన్నీ అరయాలంటుంది, వారి రహస్యాలు కనుక్కోవాలంటుంది, తెలుసుకున్న నిజాన్ని చెప్పక తీరదంటుంది.

నిజంగా, సత్యప్రమాణంగా చెప్పాలంటే నాకు మల్లెపువ్వులంటే చాలా ఇష్టం. ఆ పువ్వుకి ఇంగ్లీషులో జాస్మిన్ అంటారు. ఆ పేరు ఎంచుకుని ఆ మారుపేరుతో నేను కొన్ని కథలు రాసేను. పండిత నెహ్రూగారెక్కడ నేనెక్కడ? ఆయన మహానుభావుడు. నేను బేడాపర్కాగాణ్ని. వారికీ నాకూ హస్తిమశకాంతరం ఉంది. కాని ఆయన కూడా రచయితే. ఆయన చక్కని రచయిత. నేను కాను. ఆయనొక సారి చాణుక్యుడనే మారుపేరుతో ఒక వ్యాసం రాసేరు. (నెహ్రూగారు మారుపేరుతో వ్యాసం రాసేరనే విషయం 'ఇన్‌సైడ్ ఏషియా'లో జాన్‌గంథర్ చెప్పేరు. 'ది రాష్ట్రపతి' అనే ఆ వ్యాసం 'మోడర్న్ రివ్యూ' (నవంబరు 1937, పేజీ 448) లో వెలువడింది, ఆ వ్యాసం తన గురించే రాసుకున్నారు. నెహ్రూగారు డిక్టేటర్‌గా మారిపోతారా లేక డెమాక్రేట్‌గా ఉండిపోతారా అని ఆ వ్యాసంలో చర్చించి డెమాక్రేట్‌గా ఉంటానని అందులో తేల్చి చెప్పేరాయన.

తరువాత కొన్నేళ్ళకి మన ప్రధాన మంత్రిగా ఆయన ఇచ్చిన ఉపన్యాసాలు చదువుతూ ఉంటే వాటిలో ఆయన సలహా ఒకటి నా కంటబడింది. ఆ సలహా ఆయన ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫారిన్ రిలేషన్స్‌వారికి ఇచ్చేరు. సలహా ఇచ్చిన వ్యక్తి మహా మేధావి. సలహా పుచ్చుకునీవారు కూడా పెద్దవారే అయుండాలి. అందుచేత ఆ సలహా నేను చాలా క్యూరియాసిటీతో చదివేను వారి సలహా యీ విధంగా ఉంది:

"మీరు అవకాశమూ, వ్యవధీ ఉన్నట్లయితే, అయిదో శతాబ్దంలో రాయబడిన పురాతనపు సంస్కృత నాటకం ఒకటి చదవమని సలహా ఇస్తాను. అది రాజకీయాల్ని ఇతివృత్తంగా తీసుకున్న నాటకం. అది ముఖ్యంగా శాంతి గురించి యుద్ధం గురించి చర్చిస్తుంది. అ నాటకాల నాయకుడైన మేటి భారతీయుడు 'పరిపాలనా దక్షుడే' గాక 'రాజనీతిజ్ఞుడే' కాకుండా యుద్ధ తంత్రంలో కూడా నిపుణుడు. అతడు యుద్ధం చేసేడు. ఒక మహాసామ్రాజ్యాన్ని స్థాపించేడు. చేసి సాధించి అతనొక విషయాన్ని తెల్సుకొన్నాడు. యుద్ధం చేయడంలో ఉద్దేశ్యం యుద్ధంలో విజయం సాధించడమే కాదు,

ఒక లక్ష్యం సాధించడానికి యుద్ధం ఒక మార్గం మాత్రమే. యుద్ధం చేసి ఆ లక్ష్యం సాధించిన నాడు ఆ యుద్ధానంతరం కొత్త సమస్య లుద్భవిస్తాయి." (భారత విదేశాంగ విధానం. పేజి 260 ఇంగ్లీషు ప్రతి.)

ప్రధానమంత్రిగారి ఈ సలహా చదివినమీదట నాకు ముద్రారాక్షసం నాటకం గుర్తుకొచ్చింది. అప్పటికి నేనా నాటకం చదవలేదు. కాని అందులో నాయకుడు చాణుక్యుడు అని నేను విన్నాను. చాణుక్యుడు మేటి భారతీయుడు, పరిపాలనాదక్షుడు, యుద్ధతంత్ర నిపుణుడు. అతను యుద్ధం చేసేడు. మహా సామ్రాజ్యాన్ని స్థాపించేడు. ప్రధాన మంత్రిగారు ఆ నాటకం గురించి చెప్పేరో మరి దేనిగురించి చెప్పేరో కాని నేను 'ముద్రారాక్షసం' చదవడానికి మాత్రం వారి సలహాలే కారణం.

ఆ నాటకం చదివేక నాకు 'ఆహా' అని సరదావేసింది. 'అమ్మో!' అని భయమూ కలిగింది.

అందులో కథ టూకీగా చెప్పాలంటే:

చంద్రగుప్తుణ్ని రాజుగా చేసి రాజ్యమంతా కట్టుదిట్టంచేసే వుద్దేశ్యంతో చాణుక్యుడు యుద్ధంచేసి నందుణ్ని నాశనంచేసి చంద్రగుప్తుణ్ని సింహాసనం ఎక్కించేడు. కాని చాణుక్యుడి అభీష్టం సరిగ్గా నెరవేరలేదు. ఎందుచేతనూ అంటే నందుడు ఎగిరిపోయినప్పటికీ రాజ్యంలో అతని పార్టీవాళ్ళు మాత్రం ఇంకా బలంగానే వున్నారు. వాళ్ళందరికీ నందుడి మంత్రి రాక్షసుడనేవాడు నాయకుడిగా నిలబడి చాణక్య చంద్రగుప్తులమీద పోరాటం సాగిస్తున్నాడు.

రాక్షసుడు చాలా ఉత్తముడు.

"ఎంత ఉత్తముడు కాకపోతే చచ్చిన రాజుకి విశ్వాసంగా వుంటాడు?" అనుకున్నాడు చాణుక్యుడు.

నందుడు పోయినప్పటికీ ప్రజల్లో అతని పలుకుబడి చావలేదు. అతని పార్టీ వాళ్ళు ఇంకా బలంగానే వున్నారు. ఆ బలమైన వర్గానికి రాక్షసుడు నాయకత్వం వహించి చాణుక్యుడికి ప్రబల శత్రువుగా నిలబడ్డాడు. ఒక బలమైన వర్గాన్ని తుడిచిపెట్టి పారేసి పూర్తిగా నాశనం చేయడం చాలా కష్టం. (ఆ విషయాన్ని ఆల్జీరియాలో ఫ్రెంచివారు తెలుసుకున్నారు. వియత్నాంలో అమెరికావారు ఇంకా తెల్సుకోలేకుండా ఉన్నారు.) బలమైన ప్రతిపక్షాన్ని పూర్తిగా నాశనం చెయ్యడానికి ప్రయత్నిస్తే ఆ ప్రయత్నం విఫలం అయి, వాళ్ళ నాశనం కాకపోవడమే కాకుండా వాళ్ళంతా పర్మ

నెంటుగా ప్రబల శత్రువులుగా మిగిలిపోవడం జరుగుతుంది. అందువల్ల మౌర్య సామ్రాజ్యానికి డేంజరుంటుంది, ఏ డేంజరూ లేకుండా మౌర్య సామ్రాజ్యలక్ష్మి సుస్థిరంగా వుండాలంటే రాక్షసుడూ, తద్వారా అతని అనుచరవర్గమూ కూడా అందుకు తోడ్పడాలి.

అందుచేత, ఎదటివార్ని యుద్ధంలో ఓడించడమే కాదు, చాణక్యుడి ఉద్దేశం. ఎదరివర్గాన్ని 'అడివి ఏనుగుని పట్టినట్టు' పట్టుకుని చాకిరీ చేయించుకోడం ద్వారా రాజ్యం సుస్థిరం చేసుకోడం— అదీ అతని లక్ష్యం.

ఆ లక్ష్యం సాధించడం కోసం చాణక్యుడు చాలా శ్రమపడ్డాడు. ఎదటి పక్షం మనుషులెవరో తనసైడు మనుషులెవరో స్పష్టంగా తెలుసుకుందికి దేశంమీదికి చారుల్ని వదిలేరు. ఒక చారుడికి తెలియకుండా ఇంకొక చారుణ్ని వదిలేడు. ప్రతిపక్షంలో ఉంటూ తనకి పనిచేయడం కోసం ముందుగా వారి మధ్యకి అన్నింట్లోనూ ఆరితేరిన పండితుల్ని చల్లగా ప్రవేశపెట్టేడు. ప్రతికక్షుల్ని మోసపుచ్చడానికి తనకీ చంద్రగుప్తుడికి మధ్య 'కపట కలహం' (టోరీ విగ్గూ, రిపబ్లికనూ డెమోక్రేటూ, కాంగ్రెసూ స్వతంత్రాల మధ్య కలహం వంటి కలహం) కల్పించుకున్నాడు, రాక్షసుడి ఉంగరం సంపాదించి ఒక ఉత్తరం సంపాదించి దానిమీద ఆ వుంగరంతో ముద్ర గుద్దేడు. ప్రతి కక్షుల ముఖ్యుల్ని లాలించేడు, బెదిరించేడు, నొక్కి పెట్టేడు, చీలదీసేడు, చివరికి లొంగదీసేడు. ఎలాగైతేనేం, రాక్షసుణ్ణి "వనకరిన్" పట్టి తెచ్చినట్టు తెచ్చి అతణ్ణే చంద్రగుప్తుడి దగ్గిర పని చేయడానికి మంత్రిగా కుదిర్చి అప్పుడు తను నిష్పూచీగా సీన్లోంచి రిటైరయేడు. ఆ విధంగా, యుద్ధం చేసి పూర్తిగా సాధించజాలని లక్ష్యాన్నీ, పెద్ద యుద్ధం లేకుండా చాణక్యుడు కష్టపడి సాధించుకున్నాడు. అతని చేతిచలవ వల్ల మౌర్య సామ్రాజ్య లక్ష్మి చిరకాలం వర్ధిల్లింది.

"ముద్రారాక్షసం" చదివిన మీదట నాకు ఎన్నో సంగతులు తెలిసొచ్చేయి. అది ప్రతివాడూ చదవ్వలసిన గ్రంథం అనుకుంటాను. ప్రతి దేశానికీ కొన్ని సాంప్రదాయాలుంటాయి. బ్రిటనూ, రష్యా, అమెరికా, చైనాల గురించి ఎంతో చదివి ఎన్నో సంగతులు తెల్సుకుంటున్నవాళ్ళం మన రాజకీయ సాంప్రదాయాల గురించి మాత్రం మనం కొంతైనా ఎందుకు తెల్సుకో గూడదు?

టిటోగారి గురించి చెప్తూ చెప్తూ మధ్య దారిలో నేను ముద్రారాక్షసంలోకి జరిగిపోయేను. మన పూర్వీకుల రాజకీయ ఎత్తుగడలు పైవాళ్ళు కూడా నేర్చుకున్నారా

అనిపిస్తుంది నాకు యిటీవలి రాజకీయాలు చూస్తూంటే. టిటోగారు తటస్థంగా వుంటు న్నట్టే వుండి రష్యాలోనూ, తూర్పు యూరపు రాజ్యాల్లోనూ మార్పులు రావడం కోసం పని చేయడం చూస్తే నాకు అనుమానం కలుగుతోంది, యుద్ధం చేసి సాధించ వలసిన లక్ష్యాలు యుద్ధం చెయ్యకుండా సాధించడం కోసం ఆయన ప్రయత్నిస్తున్నారా అనేదే ఆ అనుమానం. రష్యా, తూర్పు యూరపు నాయకుల్ని "అడివి ఏనుగుల్ని" పట్టినట్టుగా పట్టడానికి టిటోచాణక్యుడు ప్రయత్నం చేస్తూ వుండొచ్చు. అదే నిజమై నట్లయితే యీ చాణక్యుడికి చంద్రగుప్తుడెవరు అనేది ఊహకి అందని విషయం కాబోదు.

ఈ సంగతి నేనొక పెద్దమనిషితో చెప్తే అతను కొంచెంసేపు ఆలోచించేడు. ఆలోచించీ, "టిటోగార్నే వనకరిని పట్టినట్టుగా పట్టడానికి తూర్పు యోరపువాళ్ళు ప్రయత్నిస్తున్నారేమో?" అన్నాడు.

అదీ ఒక పాయింటే అనిపించింది నాకు. కాని ఈ యొక్క ప్రయత్నాలవల్ల మారిందెవరు అని పరికించి చూస్తే బావుంటుందని నాకు తోచింది. అలనాడు రాక్ష సుడు మారేడు కాని చాణక్యుడు మారలేదు. ఈనాడు (ఇటువంటి ప్రయత్నాలు నిజంగా జరుగుతూన్నట్లయితే వాటివల్ల) అవతలివాళ్ళు మారేరేమోకాని టిటోగారు మాత్రం అణుమాత్రమైనా మారినట్టు కనపడరు.

టిటోగారి పనిపాట్లు మంచివో చెడ్డవో నేను చెప్పలేను. ఆ విషయం ఎవరి మట్టుకువాళ్ళు తేల్చుకోవలసుంటుంది.

కాని, ఒక విషయం మాత్రం నేను చెప్పగలను. దొంగ థీరీలూ, వక్రి భాష్యాలూ చెప్పేవాళ్ళు అవతలవాళ్ళ బాగుకోసం ఆ పన్లు చెయ్యరు. మిథ్యా తాత్ప ర్యాలాడేవాళ్ళు పరద్రవ్యాన్నాశిస్తారనే నిజాన్ని ఓ పాతకాలపు కవిగారు గట్టిగా చెప్పేరు. కొంచెం దయచేసి వినండి.

శా॥ జాతుల్చెప్పుట సేవసేయుట కృషల్ సంధించుట న్యాయవి
ఖ్యాతిం బొందుట కొండెకాఁడవుట హింసారంభకుండౌట మి
థ్యా తాత్పర్యము లాడుటన్నియు బరద్రవ్యంబు నాశించి యీ
శ్రీతా నెన్నియుగంబు లుండగలదో శ్రీ కాళహస్తీశ్వరా!

జనశక్తి 14-9-1963

## 'ప్రాగ్జోతిష్'*

పథిక్

'తూర్పు ఆయిల్ వాడండి
కాని
తూర్పుగాలి పీల్చకండి'
అంటుంది ప్రభుత్వం :
'ఆయిల్ ఇవ్వం
మారక్తాన్నిస్తాం'
అంటారు వాళ్ళు.
అప్పుడు
నారెంగీ1 నుంచి
ఇందిరా గాంధీ కార్లోకి
బిహారీ బడాబాబుల జేబుల్లోకి
అస్సాం ప్రజల రక్తం
ఆయిలై, డబ్బై ప్రవహిస్తుంది.
'తూర్పు టీ తాగండి
కాని
తూర్పు ధోరణి నెదిరించండి'
అంటుంది ప్రభుత్వం
'రక్తాన్నైనా ఇస్తాం
మా టీపొడి ఇవ్వం'
అంటారు వాళ్ళు.

అప్పుడు
ఇందిర, జ్యోతిబసు
అస్సాం ప్రజల రక్తపు కప్పులు
'ఛీర్స్' కొట్టుకుంటారు
తూర్పు రక్తాన్ని చిందిస్తూనే వుంటుంది
తూర్పు రక్తం దేశమంతటా నిండు
తూనే వుంటుంది
తూర్పు త్యాగాలు
దేశం ఆకాశం మీద
రక్తపు జెండా ఎగరేస్తాయి.
తూర్పున పొడిచిన సూర్యుడు
దేశపు నేల మీద ప్రతిఫలిస్తాడు
ఇవాళ్టి కోటి కంఠాల నినాదం
రేపు డెబ్బైకోట్ల కంఠాల్లో ప్రతిధ్వని
స్తుంది.
రేపు తూర్పు చైతన్యం దేశమంతా
నిండుతుంది.
రేపు తూర్పు గాలి గెలుస్తుంది–

---

*ఈశాన్య భారతానికి పూర్వపు పేరు 'ప్రాగ్జోతిష్'. అంటే తూర్పు వెలుగు.
1 అస్సాం నుంచి బీహార్‌లోని బరౌనీ ఆయిల్ రిఫైనరీకి ముడి ఆయిల్ పంపించే పైప్ లైన్ కేంద్రం.

## జాగ్రత్త....

వెంకన్న

అమ్మా! ఈశాన్య
ఇంఫాల్లో ట్రక్కులో నుండి పడి
చనిపోయిన గర్భిణీ స్త్రీవా?
కామ పిశాచ గణానికి
బలియై పోయిన కామరూప్ కన్యవా?
నీ ఒంటి మీద పచ్చన్నా ఆరలేదు
ఒక్కరు........ఇద్దరు........కాదువాళ్ల

రాక్షసులు సంఖ్య లేదు........
పసి గుడ్డును పొత్తి గుడ్డల్లో
ఉండగానే బయనెట్‌కు ఎరజేశారు.......
పాలిండ్లను రక్తమయం చేసారు....
గౌహతి, దిబ్రూఘర్
గోల్‌పారా పేరు ఏదైనా

అంతటా విలపిస్తున్న గీతానివి నువు
వికసించాలనుకున్న ఆకాంక్షవు నువు
నీసంఖ్య అనంతం...........
ఒంటరివి కాదు అందుకే
నిన్ను ఈశాన్య అన్నాను.......
అమ్మా నువ్వు ప్రశాంతంగా
పడిచి నందుకే నీమీద
మిలటరీ ఉక్కుగోళ్ళ రక్కులు
నువ్వు నెత్తురు కళ్లతో కదిలితే
అమ్మా ఇంకా ఎన్ని దారుణ మారణ
హోమాలో
నీకు తెలువదా అమ్మా.......
అక్కడ బందిపోట్ల
దొంగల ముఠా రాణి
యువరాజుకు సయ్యాటలు నేర్పింది
పరుగెత్తడం.......మొరగడం........
కరవడం........
నిజంగా నువ్వు వికసించాలంటే
నీ పిల్లలకు రక్త గానం నేర్పాలి
అక్కడ ముఠారాణి కొడుకు అన్నీ
నేర్చుకొన్నాడు
ఇక మీదపడి కరవడమే మొదలు.....
మనమే వెంటబడక పోతే.......వాడి
పాతపడి పోవడమే.......జాగ్రత్త.......

[కుక్కతన పిల్లలకి సయ్యాటల ద్వారా
కరవడం.... అరవడం.......
పరుగెత్తడం.......అన్నీ నేర్పుతుంది]

## ఎస్కేపిస్ట్

రుద్రజ్వాల

ఓస్ యింతేనా?

జనం కొరకు
జనంలో జనంగా జీవించటం,
జనం కలతలకి
చలించటం,
జ్వలించటం,
ఎవరికి తెలియందీ?

శత్రువు దోపిడికి సాగిలపడ్తే
అడుసుకింద తొక్కేస్తుందనీ,
ఎదుర్కొంటే తోక ముడుస్తుందనీ,
నాకూ తెల్సు.

అందుకు
మట్లోకి తోసిన పనిముట్ల బతుకుల్ని
పైకెత్తి,
చిటికలో మహోద్యమంగా నిలపటం,
శిథిల జనజీవన వసంతానికి
చివురాకు గావటం,
చినుకుగానన్నా చిందటం,
నాకు మించిందేమీ కాదు.

కాని
తీరికలేని ఉద్యోగం,
తెగని సమస్యలూ—ఆర్థిక యిబ్బందులూ,
వెనుక పిల్లా, పీచూ
బాదరబందీ,
లేకుంటేనా?

ఎహే!

## కిరండుల్*

కాంతి

ఈ కొండలు ఒకనాడు
కోపాగ్నికి ప్రతిరూపాలు
కోరుకున్న హక్కుల కొరకు
కొస కత్తిలా పదునెక్కిన పర్వతాలు
నిద్రపోయి దిగాలుగా
మొద్దుబారినట్టున్నాయి
సపోటా పళ్ళమ్ముతూ
బ్రతుకు సపోర్టు కోసం
వచ్చేపోయే రైళ్ళవైపు చూస్తూ
ఓపికగా నిలబడ్డ
యలమంచిలి యానాదులు
కొత్తవలస కోయలు
చెప్పకనే చెపుతున్నారు నాకు,
మా బతుకులివని
అడగకనే అడుగుతున్నారు నన్ను
దీనికి ఎవ్వరు మూలమని?

*విశాఖనుండి దండకారణ్యకు అరకులోయమీదుగా వెళ్ళే రైలుదారి

## ఆకాంక్ష

అజ్ఞాత సూరీడు

ఈ ఒక్క క్షణాన్నీ నేనిప్పుడు
సాగదీసి కాగడాలాగా
వెలిగించబోతున్నాను—

ఆ వెలుతుర్లో—
పాపాల చీకట్లను
జీవితాల తాకట్లను
తుదముట్టించ బోతున్నాను—

దీని వేడితో—
ప్లాస్టిక్ విలువలన్నింటినీ కరిగిస్తా
జీవితపు ఎలాస్టిక్‌ను
ఇంకెప్పుడూ సంకోచించకుండా చేస్తా

"తమిళనాడులోని ధర్మపురి జిల్లా గ్రామాల్లో పోలీసులు విప్లవకారుల కోసం గాలింపు చర్యలు జరుపగా, ప్రజలు సహకరించటంలేదు" అన్న వార్త విన్నప్పుడు కలిగిన స్పందన ఇది.

## నేనూ....

అన్నపురెడ్డి సాంబశివరావు

అమ్మా!
నిన్ను దహనం చేస్తున్నపుడు
ఆ ఎర్రటి మంటల్లో
వాళ్ళపై నీ క్రోధాన్ని చూశా—

వాళ్ళు
పెద్దన్నను చంపితే—
ఆనాడు నువ్వు
రొట్టె కాలుస్తూ....
పిండి ముద్దను
గుప్పెట్లో పిసుకుతున్నపుడు
పెనంలా కాలుతున్న
నీ గుండెను చూశా—

కూరలు చెంగులో వేసుకొని
బజారునుంచి వస్తూ....
"చిన్నన్న రక్తం ఈగడ్డలో కలిసింది"
అని విన్న నువ్వు ఏడ్వలేదు,
నీకళ్ళు పసివాడిగా ఉన్న నన్ను
చూసేయి గర్వంతో....
ఆనాడు నువ్వు
"ఈ రొట్టె కోసమేరా"
అనికదూ అమ్మా అన్నావ్!

అవునమ్మా! ఆ రొట్టెకోసమే
నువ్వూ బలై పొయ్యావ్!
కాని,
నేనిప్పుడు పసిపాపను కానమ్మా........

## పిప్రా

సిఎచ్. మధు

కలల నక్షత్రాలు కాలిపోయిన తర్వాత
ఆకాశం ఎర్రగా మండుతూవుంది

14 మంది
అంతే—

సజీవ దహనాల మంటలు
ఆకాశం పైకి లేచి
పొగ శ్రమజీవుల కళ్లను ఎరుపెక్కించి

ఆకాశం ఎర్రగా మండుతూవుంది.

నక్షత్రాలు రాలి కాలిపోనీ—
లక్షల నక్షత్రాలలో కొన్ని
సూర్యుని కోసం—
నేల రాలి కాలిపోనీ—

భూమికోసం పైకి లేచిన
హరిజనుల చేతుల మీద
తర తరాల కులాంతరాల
ఇనుప గొలుసులు కాల్చి అంటించనీ—

భూస్వాముల తుపాకీలు
ఊళ్ళను బూడిద చేసినా—

చీకటి మాత్రమే కాలిపోతూవుంది.
శ్రమజీవుల కళ్ళను ఎరుపెక్కించి
ఆకాశం ఎర్రగా మండుతూవుంది.

# గరీబ్‌కో హఠావో!?

ఎన్నారెస్

సరూర్‌నగర్ గుడిసెలన్ని
బర్ర బర్ర పీకేసి
నీడజూపె సర్కారే
ఉన్న నీడ పీకేస్తె

బీరిపొయ్యే సూత్తివో
బారెడు మీసాల మల్లు
బిక్క మొకం బెడ్తివో
బండకాడి బక్కెల్లు

ఇనుపకాళ్ళ 'కాకి' మూక
తడ్క పొర్క తొక్కెసె
అంటు మాడు గడ్క కుండ
బుల్డోజరు నాకేసె

నీకు నిలబడ జాగేదియో
పెద్దకోట బూమయ్య
గబ్బిలాల బతుకులే
గొబ్బిపూల గోపయ్య

పెంచున పేలాలోలె
సంగ సంగ యెగురుకుంట
ఎర్రెండ చీమలోలె
రోడ్లమీద దొర్లుతుంటె

నీకు నిలువనీడ యేదయో
జమాల్‌పూర్ జహంగీరు
నీకు దిక్కు యెవరయో
దేవిడ్సన్ జేముసయ్య

రిక్షోల్ల బండోల్ల
క్లీనర్ల గుడిసెలవ్వి
పాయకాన్లు సాపుజేసె
మేతరోల్ల పాకలవ్వి

ఊరికందం లేవనీ
గంధసిరి చెందురయ్యా
ఊడబీకి నారయో
ఉడుంపట్ల ఉప్పలయ్యా

యెన్కబడ్డ వోల్లన్నరు
పేదోల్లకు ఇండ్లన్నరు
ఓటుకొక్క గుడిసన్నరు
ఓట్లమీద ఒట్టన్నరు

బంగారు ఆశతో
బడుగోల్ల బసవయ్యా
పులిపంజన బడితివో
బలిదానపు ఓటరయ్యా

పేదలంటె సానుబూతి
గలదన్నడు కలట్టేరు
కానీ *కానూర్లోన
పేద జాగ లేదన్నడు

పేద చట్ట మొస్తెగానీ
బోజరాజు బూపతయ్యా
దొర్జెన్నాలుండవో
దార్నాల పాపయ్యా

---

*ఖానూన్ - చట్టము

## దోపిడి - విప్లవం

బొల్లిముంత నాగేశ్వరరావు

మనిషీ, మనిషీ మూగమనిషీ
ఓటిపొట్టకు గంజి పోస్తే
గంజి నీకు శక్తినిస్తే
శక్తి నీవు చెమట చేసి
భూమి దున్ని బాగుచేస్తే
పంటలు పండీ ధాన్యంవస్తే
'దొరలూ' వచ్చి తోలుకుపోతే
ఆకలయ్యి అవురుమంటే
అంతలోనే ఎన్నికలొస్తే
తిండి కరువు ఉండదంటూ
ఓటు నీకు చేతికిస్తే
నాకే వెయ్యని నాయకుడంటే
నిజమేనంటూ నువ్వూ వేస్తే
నాయకుడేమో మంత్రి అయితే
సంబరపడి నీవు పోయి
సంగతి చెప్పి తిండీ అంటే
మంత్రిగారూ మండీ పడితే
పోలీసారు పరుగునవస్తే
ఓటుకు చెల్లూ తూటాలంటూ
తుపాకూలూ ధన్‌ధన్‌మంటే
గాయం తగిలి క్రిందా పడితే
నెత్తురు నేలా పారుతుంటే
ప్రళయం వచ్చి అగ్నిపుడితే
వేలకు వేలూ వీరులువస్తే
ప్రజల మేలు చూడనట్టి
పాలన పేరు 'దోపిడీ'
ఎదురు తిరిగి విజృంభించిన
ప్రజల పేరే 'విప్లవం'.

---

## మున్సిపాలిటీ

భూపాల్

ఒకరు :

ఓహో... మున్సిపాలిటీ నీ
మురికి జాడ ఒస్తావ బస్తి బస్తికీ
॥ఓహో॥

మరొకరు :

ఆఁ! ఊఁ! తియ్యక్కడ
మా మున్సిపాలిటుండంగ
మురికుంటదా ॥ ఆఁ! ఊఁ! ॥

ఒకరు :

నీకు బీదబస్తి కాల్వలు కనిపిస్తయా?
ఆ మురుగు నీళ్ల పందులు
కనిపిపిస్తయా?
పంది పంది పక్క నుండి
పది పది పిల్లలు
కుమ్ము కుంట చిత్తు కుంట
ఏన్గు లెక్క పొర్లుతుంటె
గుర్రుగుర్రు సప్పుడన్న ఇనిపిస్తదా
॥ఓహో॥

మరొకరు :

ఆఁ ఊఁ! తియ్యక్కడ
మా మున్సిపాలిటుండంగ
కాల్వలుంటయా ?
ఆఁ! ఊఁ! తియ్యక్కడ
మా మున్సిపాలిటుండంగ
పందులుంటయా
ఆఁ! ఊఁ!

ఒకరు :

నీకు ముక్కు తెగె ముర్కి వాస
నొస్తున్నదా ?
నీకు కండ్లు తిరిగె కంపైన
గొడుతున్నదా ?
దోమ దోమ గుడ్లు పెట్టి
కోట్ల కొద్ది దోమలయ్యి
పండనీక ఉండనీక
జెరం మీద జెర మొచ్చి
బోదెకాలు మలేర్యంటు
సోకదంటవా ? ॥ఓహో॥

మరొకరు ;

ఆఁ! ఊఁ! తియ్యక్కడ
మా మున్సిపాలిటుండంగ
ముర్గుంటదా ?
ఆఁ! ఊఁ! తియ్యక్కడ
మా మున్సిపాలిటుండంగ
దోమలుంటయా ఆఁ! ఊఁ!

ఒకరు :

నీకు బస్తి బస్తి కుండినిండి
కనిపిస్తదా
నీకు కుళ్ళు కంపు వాసనన్న
వొస్తుంటదా?
గుడిసెలల్ల ఇండ్లల్ల
పుట్లకొద్ది ఈగెలయ్యి
కక్కుడేర్గుడూ లేసి
రోగమొచ్చి సచ్చిపోతె
సచ్చిరన్న సంగతన్న తెలుస్తున్నదా
॥ఓహో॥

మరొకరు :

ఆఁ! ఊఁ! తియ్యక్కడ
మా మున్సిపాలిటుండంగ
కుండి నిండదా ?
ఆఁ! ఊఁ! తియ్యక్కడ
మా మున్సిపాలిటుండంగ
ఈగలుంటయా ? ఆఁ! ఊఁ!

ఒకరు :

నీకు డ్రైనేజి మోరి నింతె
కనిపిస్తదా
నీకు రోడ్లపొంటి గలీజ్ నీళ్ళు
కనిపిస్తయా
నల్లనీళ్ళు డ్రైనేజ్ నీళ్ళు
దోస్తులయ్యి కలిసొచ్చి
కొంపకొంప లాంప్రకుంట
కాళ్ళుకడుపుల్నొప్పితోటి
పక్కలొచ్చి పానంబోతె
తెలుస్తున్నదా ॥ఓహో॥

సమీక్షలు :

## సమానతా నువ్వెక్కడ?

అసమానత సర్వాంతర్యామిలా వ్యాపించివున్న యీ దేశంలో మనం వెతక వలసింది సమానతే. 'సమానతా నువ్వెక్కడ?' అని ప్రశ్నించడం వల్లనే యీ పుస్తకంలోని 12 మంది రచయితలూ ప్రస్తుతం మన దేశంలో సమానత లేదన్న అభిప్రాయంతో ఏకీభవించినట్టు తెలుస్తుంది

శ్రీ మహీధర రామమోహనరావు, శ్రీ పుప్పాల చిట్టిసాయిబాబు, శ్రీ గంటి శ్రీరామమూర్తి, శ్రీ గుంటుపల్లి రామారావు, శ్రీ మంథా వెంకటరమణారావు, శ్రీమతి అడవికొలను పార్వతి, శ్రీ కె.వి. రమణారెడ్డి, శ్రీమతి మల్లాది వెంకట సుబ్బమ్మ, శ్రీ అల్లం రాజయ్య, శ్రీ ఎం.వి. రామమూర్తి, శ్రీ జ్వాలాముఖి, శ్రీ నిష్ఠల వెంకటరావుగార్లు 'సమానతా నువ్వెక్కడ?' అన్న ఒకే విషయంపైన రాసిన వ్యాసాల సంకలనం ఇది. వీరిలో 20 సం॥ల నుంచీ 70 సం॥ల వరకు వయసుగల వ్యక్తులున్నారు.

అయితే సమానత అన్న పదానికి అర్థం చెప్పడంలోనూ, దాన్ని సాధించ డానికి కావలసిన పరిష్కారాన్ని వెతకడంలోనూ నలుగురైదుగురికి తప్ప మిగతా వారికి శాస్త్రీయ దృక్పథం లేదు.

---

మరొకరు:

ఆఁ! ఊఁ! తియ్యక్కడ
మా మున్సిపాలిటుండంగ
గలీజుంటదా ?
ఆఁ! ఊఁ! తియ్యక్కడ
మా డైనేజ్ నీళ్ళతోటి మీకు
పస్కలొస్తయా ? ఆఁ! ఊఁ!

ఒకరు:

మీరు పాయఖానలేదనన్న గట్టిస్తిరా
పోని ఉచ్చపోశె కానలన్న గట్టిస్తిరా
పదిగంట లయ్యేదాక
రోడ్లుసుత్తెక్క ఊకన్నైరి
దిక్కులేని కుక్కలైన

మనుషులైన సచ్చిపోతె
తియ్యనీకె మూడు రోజు
లవ్వవంటవా
ఓహో... మున్సిపాలిటీ
నీకు సిగ్గన్న లేదంటె
ఒప్పుకుంటవా ? ॥ఓహో॥

మరొకం:

ఆఁ! ఊఁ! తియ్యక్కడ
మా సర్కారు ఎట్లుంటె
గట్లుండమా ?
ఆఁ! ఊఁ! తియ్యక్కడ
మా సర్కారు ఎట్లుంటె
గట్లుండమా ?

కొందరి స్టేట్ మెంట్లు చాలా సిల్లీగా కూడా వున్నాయి. అసమానతను పరిహరించినపుడే సమానత సాధ్యమౌతుందట! చాలా గొప్ప సత్యాన్ని కనుక్కున్నాడీ రచయిత! వెనకటికో రాజకీయపార్టీ తమ పార్టీ ఎన్నికల్లో ఎందుకోడిపోయిందని ప్రశ్నించుకొని, గంటలతరబడి చర్చించి, చివరకు ప్రజలు ఓట్లు వెయ్యకపోవడం వల్ల ఓడిపోయిందని తీర్మానించిందట!

ఒకరి పొదుపు, మరొకరి దుబారా ఖర్చు ఆర్థిక అసమానతకు ఒక కారణమని ఒక రచయిత అభిప్రాయం. కేవలం పొదుపువల్ల లక్షలు కోట్లూ, వందల వేల ఎకరాలూ సంపాదిస్తున్నారని నమ్మేంత అమాయకుడా ఈ రచయిత? భూతద్దంలో చూపినంత స్పష్టంగా కనబడే ఆర్థిక దోపిడీ ఈ మేధావికి కనబడదు! నిజమయిన శాంతి, సౌఖ్యం లేకపోవడానికి ఆర్థిక, రాజకీయ వ్యవస్థలు కాదట కారణం! సమానత్వాన్ని సాధించడానికి ముఖ్యంగా మనుషుల్లోవున్న రంగు, రేసు, పొట్టి పొడుగు భేదాన్ని నిర్మూలించాలట! ఇంటిపేర్లూ, కులాన్ని తెలియజేసే పేర్లూ తొలగించడం దేశమంతా ఒకే లిపి, ఒకే భాషలను ప్రవేశపెట్టడం లాంటవి చేస్తే అసమానత దానంతటదే పోతుందట! సమానత దానంతటదే వస్తుందట! నూటికి తొంబై మంది మేధావులు ఇలా ఆలోచిస్తున్నారు మన దేశంలో.

అసలు కొందరి జీవితాల్లో సుఖాలూ, మరికొందరి జీవితాల్లో దుఃఖాలూ ఎందుకున్నాయని ప్రశ్నించుకోవడమే ఆస్తిక ధోరణి అవుతుందట. పేదవాడి జీవితాన్ని గురించి ఆస్తికత్వం ఎప్పుడయినా ఆలోచించిందా? ఒకవేళ ఆలోచించినా ఆ సమస్యను దేవుడికో, కర్మకో ముడిపెట్టిందే తప్ప లౌకికమయిన పరిష్కారాన్ని వెతికిందా? కూటికిలేని పేదవాళ్ళు ఎలాంటి అలజడీ చెయ్యకుండా ధనికులు దేవుణ్ణి వూహించారనడమూ సరికాదు, దేవుడు ఆదిమానవుడి భయంలోంచి పుట్టాడు. ఆ తర్వాత దోపిడీవర్గాలు పేదల్ని పీల్చి పిప్పిచెయ్యడానికీ, వాళ్ళనలాగే అజ్ఞానంలో వుంచడానికీ యీ దేవుణ్ణి ఒక బలమయిన సాధనంగా వాడుకున్నాయి.

స్త్రీలకు చాలా విషయాల్లో హక్కులు లేవు, నిజమే ప్రజాస్వామ్య దేశాల్లో ప్రజాభిప్రాయ సేకరణలో అవకతవకలున్నాయి, కాదనలేం, ఆస్తి వున్నవాళ్ళు తమకు అవసరమయినంత మాత్రమే వుంచుకుని తక్కిందీ దానం చెయ్యాలి. మంచిదే, యివన్ని ఎలా జరుగుతాయన్నదే ప్రశ్న. ఇక్కడే మార్క్సిజాన్ని అనుసరించేవాళ్ళకూ, ఇతరులకూ తేడా కనిపిస్తుంది. ఒక్కొక్క అసమానతనూ విడివిడిగా చర్చించి, ఒక్కొక్క పరిష్కారమార్గాన్ని కనుక్కోవడం, చెట్టు మొదలు

తడపకుండా ఆకు ఆకూ తడపడం లాంటిది. వ్యక్తిగత హృదయపరివర్తనలవల్లా గాంధీగారి ట్రస్టీషిప్పువల్లా ఆర్థికంగా గాని, సాంఘికంగా గాని మార్పు వస్తుందనుకోవడం వట్టి భ్రమ. ఉన్నవాడు లేనివాడికి దయదల్చి డబ్బు యివ్వాలంటే అర్థం ఏమిటి? ఉన్నవాళ్ళూ లేనివాళ్ళూ అలాగే ఉండాలని కోరడం కాదా? ఎప్పుడూ ఒకరి దయాదాక్షిణ్యాలమీదనే మరొకరు బతకాలనుకోవడం అసమానతల్ని కాపాడ్డం కాదా? అసమానతల్ని పోగొట్టడానికి ఓదార్పు పద్ధతులు పనికిరావు. 'దెయ్యం' దెబ్బకే వదుల్తుందన్న పరమ సత్యాన్ని గుర్తించాలి.

మతం కూడా గతంలో సోషల్ ఫిలాసఫీయేనట! కావచ్చు. కాని యీనాడు కాదుగదా! వర్తమానంలోని సోషల్ ఫిలాసఫీని గూర్చి మాట్లాడకుండా గతంలోని సోషల్ ఫిలాసఫీ గూర్చి ఊదరగొట్టడంలో ఉద్దేశమేమిటి? సోషలిస్టు వ్యవస్థపై ఉన్న గుడ్డి వ్యతిరేకతను కొందరు రచయితలు ఈ విధంగా వెళ్ళగక్కారు సోషలిస్టు దేశాల్లో కూడా సమానత్వం లేదట. స్వేచ్ఛ లేదట అక్కడా తేడాలున్నాయట. సమానత్వమంటే పైన వివరించినట్టుగా వెర్రిమొర్రిగా ఆలోచించేవాళ్ళకు సమానత్వం ఎక్కడా కనబడదు. వీళ్ళు ఉన్న వ్యవస్థనూ సమర్థించలేరు. సోషలిస్టు వ్యవస్థనూ ఆహ్వానించలేరు. పోనీ తాము కోరుకునే వ్యవస్థ స్వరూపాన్ని వివరించలేరు.

ఈ పుస్తకంలోని కొందరు రచయితల ఉద్దేశంలో అసమానత అంటే-స్త్రీ పురుష భేదాలూ, పొట్టి పొడుగు తేడాలూ. తెలుపు నలుపు తారతమ్యాలూ. మిట్టపల్లాలూ వగైరా! ఆర్థిక అసమానత వాళ్ళ దృష్టిలో చాలా అప్రధానం

ప్రకృతిసిద్ధమయిన అసమానతలు వేరు. మానవ కల్పితమయిన అసమానతలు వేరు. ప్రకృతిసిద్ధమయిన అసమానతలవల్ల మనకేమీ నష్టంలేదు వాటిని పోగొట్టాలని ప్రయత్నించడం కూడా అనవసరమే. సమానత్వాన్ని సాధించడమంటే మానవ కల్పితమయిన అసమానతల్ని పోగొట్టడమే. మొదట ఈ విషయాన్ని గుర్తిస్తే, తర్వాత పరిష్కారమార్గం దొరుకుతుంది

వ్యక్తిగత ఆస్తి లేనప్పుడూ, ఉత్పత్తి శక్తులు వ్యక్తుల చేతుల్లోగాక ప్రభుత్వం చేతిలో ఉన్నప్పుడూ ఆర్థికమైన దోపిడీకి అవకాశం లేదు. దోపిడీ చెయ్యడానికున్న అవకాశాన్ని తొలగించాలే తప్ప, ఆ అవకాశాన్ని అలాగే వుంచి దోపిడీ చెయ్యవద్దని ఎంత చెప్పినా మనం దోపిడీని అరికట్టలేం. దోపిడీకి అవకాశం కల్పించి, దోపిడీ చెయ్యవద్దని హృదయ పరివర్తన సిద్ధాంతం కల్లబొల్లి కబుర్లు చెబితే, అసలు

దోపిడీ చేసే అవకాశాన్ని తొలగించమని సామ్యవాదం చెబుతుంది. ఈ రెంటిలో ఏది ఆచరణ సాధ్యమో ప్రత్యేకించి చెప్పనక్కరలేదు. ఈ పెట్టుబడిదారీ భూస్వామ్య వ్యవస్థకు కొమ్ముకాసే ఏ ప్రభుత్వమయినా వచ్చినా పైప్రేటు ఆస్తుల్ని వశపర్చుకోలేదు. కార్మిక నియంతృత్వంతో కూడిన ప్రభుత్వం మాత్రమే ఆ పని చెయ్యగల్గుతుంది. చరిత్ర చెప్పిన, చెబుతున్న యీ సత్యాన్ని ఈ పుస్తకంలో చాలా కొద్దిమంది మాత్రమే గుర్తించారు— చాలు. అందుకోసమైనా ఈ పుస్తకాన్ని చదవాలి.

మూడు పూటలా సుష్టుగా భోంచేసే అవకాశం ఉన్న కొందరు మేధావులు ప్రస్తుతం తామున్న 'ప్రజాస్వామ్య' వ్యవస్థలో లేని భావస్వేచ్ఛను గూర్చి పట్టించుకోరు, కొంతవరకయినా సమానత్వాన్ని సాధించిన సోషలిస్టు దేశాల్లో భావస్వేచ్ఛ లేదని గోలపెడతారు. కొందరు మహారాజుల్లా బతుకుతూ, కొందరు అడుక్కుతింటూ వుంటే సహించగలిగిన వాళ్ళు, ఈ ముఖ్యమయిన అసమానతను రూపుమాపే ప్రాథమిక దశలో విధించే కొన్ని పరిమితులవల్ల తమ స్వేచ్ఛనంతా హరించినట్టు వాపోతారు.

పెట్టుబడిదారీ వ్యవస్థ తర్వాత సామ్యవాద వ్యవస్థ వస్తుందని మార్క్సు చెప్పాడు. కాని కొన్ని దేశాల్లో ఫాసిజం వచ్చింది. అందువల్ల మార్క్సు సిద్ధాంతం తప్పట! ఫాసిజం అనేది పెట్టుబడిదారీ వ్యవస్థ వికృతరూపం అన్న ప్రాథమిక సత్యం కూడా ఈ రచయితకు తెలియదు. ప్రజాస్వామ్యం పెట్టుబడిదారి వ్యవస్థకు ఒక ముసుగు మాత్రమే. తన ఉనికికే ప్రమాదం వచ్చినపుడు ఆ ముసుగును తొలగించుకుని, తన సహజమయిన, వికృతమయిన ఫాసిజాన్ని బయటపెడుతుంది.

మార్క్సిజం వల్ల సమానత్వం రాదనీ, వచ్చినా నిజమయిన శాంతీ, సౌఖ్యం లభించవనీ చెప్పడానికి ఈ పుస్తకంలో కొందరు రచయితలు పడ్డ పాట్లు చూస్తుంటే నిజంగా జాలేస్తుంది!

— వి. చెంచయ్య

---

[21స్ట్ సెంచరీ రైటర్స్ విశేష ప్రచురణ — వ్యాస సంకలనం — 116 పుటలు వెల: 5 రూ — ప్రతులకు: లీడింగ్ బుక్ సెల్లర్స్ (లేక) 21స్ట్ సెంచరీ రైటర్స్ 26-3-22, దాసన్నపేట, విజయనగరం 531 202]

# కోరస్ – ఒక పరిశీలన

భారతాంధ్రీకరణతో కావ్యరూపం పొందిన తెలుగు సాహిత్యం దాదాపు 20వ శతాబ్దపు ప్రారంభం వరకు రాజుల, జమీందారుల ఆస్థానాలలో రాజనర్తకి కాలి మువ్వలకు ప్రతిధ్వనిగా, అంతఃపుర కౌగిళ్ళలో బందీగా, ఏలికల శౌర్యాలకు శృంగారాలకు బాకాగా, సామాన్య ప్రజానీకానికి అందని అందంగా కృత్రిమ అలంకారాలతో, సగిషీలతో జీవించింది. సామాన్యుల కష్టాల, కన్నీళ్ళ నిష్ఠుర జీవితాలు ఆనాటి సాహిత్యపు కడగంటి చూపుకైనా నోచుకోలేదు. భారత స్వాతంత్ర్యోద్యమ కాలంలో పురుడుపోసుకున్న భావకవిత్వం జమీందారీ కవిత్వంమీద తిరుగుబాటు చేసింది. కానీ భావకవిత్వం జీవిత సమస్యల నుంచి పలాయన తత్వాన్నే ఆశ్రయించింది. భావకవులు తమకే సరిగ్గా తెలియని బాధల్ని గాఢంగా పాడుకుంటూ నిరాశలో కూరుకుపోతున్న రోజుల్లో అభ్యుదయ సాహిత్యోద్యమం భావకవిత్వంపై తిరుగబడి సామాన్యుల సమస్యల్ని, జీవితాల్ని కొంతవరకైనా ప్రతిబింబించింది. అప్పటికే వచన కవిత్వం శ్రీశ్రీ సారథ్యంలో గణ ఛందోబద్ధ సాంప్రదాయ కవిత్వపు నడ్డివిరగ్గొట్టే ఉద్యమంగా విజృంభించింది. వ్యావహారిక భాష అన్ని కళారంగాల్లో ఒక మేరకు చొచ్చుకపోయింది. రానురాను కప్పల తక్కెడగా తయారైన అభ్యుదయ సాహిత్యోద్యమం అవకాశవాదంతో, వ్యక్తుల విభేదాలతో విచ్ఛిన్నమై పోయింది.

1947 నాటి అధికార మార్పిడి సామాన్య మానవుని బాధల్ని రూపుమాపలేకపోగా పెట్టుబడిదారీ, భూస్వామ్య దోపిడీ విధానాన్ని పాదు కట్టి పెంచింది. దోపిడీ విధానాన్ని వెంట్రుకవాసి కూడ కదిలించాలనే దృక్పథంలేని అభ్యుదయ సాహిత్యోద్యమం శవప్రాయమైంది. ఆ సమయంలో, నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాల చైతన్యంతో ప్రాణం పోసుకుంది సాహిత్యం. పీడిత ప్రజల బాధల్ని కన్నీటి జీవితాల్ని, పోరాట చైతన్యాన్ని తన ఊపిరిగా పీల్చుకుంటూ మున్ముందుకు సాగుతున్నది విప్లవ సాహిత్యం. వచన గేయాలు, అంతకంటే పాటలు ప్రజల వద్దకు, పోరాటాల మధ్యకు బలంగా చొచ్చుకపోతున్నవి నేడు.

ఇలాంటి సందర్భంలో విప్లవ సాహిత్యవాదం చేయవలసింది దీర్ఘ వచన కవితలు గొప్పా, మినీ కవితలు గొప్పా, లేక పాటలు గొప్పా అన్న కేవలం 'కుర్చీ చర్చలు' కాదు. ప్రజల ఆదరాభిమానాలు, ప్రయోజనం గీటురాయిగా నిర్ణయాలు జరగాలి. ఏయే రూపాలలో సాహిత్యం ప్రజల మధ్యకు చైతన్యవంతంగా, బలంగా వెళ్ళగలదో ఆయా రూపాలలో సాహిత్య సృష్టి సాగడం ఎంతైనా అవసరం.

ఆయా సందర్భాలలో, సమయాలలో వేటి శక్తి వాటికుంటుంది. ఇంతవరకు వచన కవిత్వం తెలుగు సాహిత్యాన్ని ఒక ఊపు ఊపిన మాట నిజం. నేడు పాటలు ప్రజల్ని శక్తివంతంగా ప్రభావితం చేస్తున్నవి. అంతమాత్రాన వచనగేయాల కాలం చెల్లిపోలేదు. వీటి ప్రభావాన్ని తక్కువగా అంచనా వేయవలసిన పనిలేదు. అట్లాగే దీర్ఘవచన కవితల, మినీ కవితల విషయం కూడ. దీర్ఘవచనకవితలకి మినీ కవితలు ప్రత్యామ్నాయం కాదు. దేని మంచీ, చెడులు దానికున్నవి. ఒక సంఘటనను గాని దృశ్యాన్నిగాని విశాలంగా, ప్రతిభావంతంగా దీర్ఘవచనకవితలో చిత్రించినంతగా మినీ కవితలో చిత్రించలేము. ఈనాడు మనకున్న మంచి గేయాలు ఎక్కువ భాగం దీర్ఘ వచన కవితలే- పేజీలకు పేజీల నిడివితో పాఠకులకు విసుగు పుట్టించిన కవితలూ లేకపోలేదు- ఇలాంటి దీర్ఘకవితలకంటే మినీకవితలు ఎన్నోరెట్లు మేలు- మేలైన దీర్ఘ కవితలు రాయడం ఎంత కష్టమో, శక్తివంతమైన మినీ కవితలు రాయడం కూడ అంతకష్టమే. మినీ కవితలలో ముఖ్యంగా కావాల్సిన లక్షణాలు సూటిదనం, స్పష్టత, క్లుప్తత, నిశిత విశ్లేషణ. అలలు అలలుగా వచ్చే భావాల్ని crystalise చేయాల్సిన నేర్పరితనం మినీకవితలకు కావాలి- ఈ గుణాలు లోపిస్తే మినీకవితలు విఫలం చెందినట్లే

దామెర రాములు వినిపిస్తున్న "కోరస్" చాలవరకు మినీకవితల సంకలనం. "రేయనక పగలనక / ఎండనక వాననక / బుక్కెడు మెతుకుల కోసం / రెక్కలు ముక్కలు చేసుకుంటున్న / ఓ కర్షకా ! నిను గూర్చి వ్రాయడానికేనయ్యా / నేను కవిత్వం నేర్చుకున్నది" అంటూ తన శ్రామిక జన పక్షపాతాన్ని, కవిత్వం యొక్క సార్థకాన్ని స్పష్టం చేస్తున్నాడు.

"ఎందుకు?" అన్న గేయంలో "పక్షులు / రెక్కలు విప్పుకొని / మేత కోసం ఎగిరిపోతూంటే / రెక్కలు విరుచుకుంటూ / నువ్వెందుకు / కటిక దరిద్రంలో బందీవైతివి?" అని పీడితుల మెదళ్ళలో ఆలోచన సుడులురేపే ప్రశ్న వేస్తున్నాడు- "నాకున్నవి రెండేరెక్కలు / పనిచేయడమే తెలుసు వాటికి / ఎక్కడి నుంచి తెమ్మంటావ్ డాక్టర్ ! నా కొడుక్కి పుష్టికరమైన భోజనం?" అని శ్రమజీవి చాలమంది డాక్టర్లకు 'అగ్నిప్రశ్న' వేస్తున్నాడు.

"ముంపు" గేయంలో కవి, ఉప్పొంగుతున్న కన్నీటి సముద్రాలు, కన్నీటికి కారకులైన వారిని కనికరించవని హెచ్చరిస్తున్నాడు,

అనుభూతివాదుల్నీ, సమాజాన్ని తలక్రిందుల చూసే విలోమకారుల్నీ "ఇది భూలోకం-" అని హెచ్చరిస్తున్నాడు,

మార్క్సిజం-సాహిత్యం - చర్చ :

# సాహిత్యం - మార్క్సిజం

'మార్క్స్ దృష్టిలో సాహిత్యం' అనే వ్యాసం ద్వారా మార్క్సిజాన్ని వక్రీకరించడానికి యత్నించిన ఆరెస్ సుదర్శనాన్ని విమర్శిస్తూ త్రిపురనేని మధుసూదనరావుగారు తమ వ్యాసంలో మార్క్సిస్టు మూల సూత్రాలైన గతి తార్కిక భౌతికవాదాన్ని చారిత్రిక భౌతికవాదాన్ని విపులంగా చర్చించారు.

త్రిపురనేని విమర్శను చాలా వరకు అంగీకరిస్తూనే (ఒక్క గ్రీకు సాహిత్యం విషయంలో తప్ప) వారి విమర్శపై కొన్ని ఆక్షేపణల్ని, సుదర్శనంగాని త్రిపురనేనిగాని చర్చించని మరికొన్ని ముఖ్యమైన అంశాల్ని వ్యక్తం చెయ్యడానికి రాస్తున్న వ్యాసమిది.

త్రిపురనేని వ్యక్తం చేసిన అభిప్రాయాలు ఏ మార్క్సిస్టూ తిరస్కరించజాలనివి- అయితే చారిత్రిక భౌతిక వాదాన్ననుసరించి త్రిపురనేని "పరిసరాల ఎరుక, తన మనస్తత్వం పని చేసే స్వీయ ఎరుక వ్యక్తి చైతన్యం అవుతుంది- స్వీయ ఎరుక సామాజిక ఎరుక నుండి ఉత్పన్నమవుతుంది"[1] అనిరాశారు. స్వీయ ఎరుక ఈ సమాజంలో ఎందరికివుంది? స్వీయ ఎరుక దానంతటదే అనివార్యంగా సామాజిక ఎరుక నుండి ఉత్పన్నమవుతుందని సూక్ష్మీకరించి యాంత్రిక భౌతిక వాదాన్ని అంగీకరిస్తున్నారు- అంటే మార్క్స్ విమర్శించి తిరస్కరించిన యాంత్రిక భౌతిక వాదాన్ని.

---

'రక్తస్వప్నం'లో "తూర్పంతా నెత్తురు పులుముకొని / తెలంగాణాలో మళ్ళీ / ఎర్రపూపై వికసిస్తూంది" అన్న చరణాలు నేటి జగిత్యాల, సిరిసిల్లా రైతాంగ పోరాటాలను కీర్తిస్తున్నాయి- "కుబుసం" గేయంలో కవి 'ఎమర్జెన్సీ' సర్పం యింకా చావలేదని, అది కేవలం కుబుసం విడిచి పుట్టలోకి వెళ్ళిందని హెచ్చరిస్తున్నాడు. పుట్టలోకి వెళ్ళడమే కాదు మళ్ళీ బయటకు వచ్చే సూచనలు కనిపిస్తున్నాయి నేడు. భవిష్యత్ రాజకీయ పరిణామాలపట్ల కవి దృష్టికి ఈ గేయం నిదర్శనం.

పాఠకులకు అర్థంకాని అలంకారాల, పదచిత్రాల, ఇమేజరీల జోలికిపోకుండా దామెర రాములు తన భావాలను సూటిగా చెప్పగలిగాడు "కోరస్"లో.

— సి. రామచంద్రారెడ్డి

---

'కోరస్' 52+VIII పేజీలు వెల రు. 2-50
ప్రతులకు : పీస్ బుక్ సెంటర్, 3-4-74/3, హైదరాబాదు - 500 027.

స్వీయ ఎరుక ఉత్పన్నం కావడంలో వ్యక్తి ఆలోచన, జ్ఞానస్థాయి, చైతన్య స్థాయి, వ్యక్తి గుణగణాలు నిర్ణయాత్మకపాత్ర వహిస్తాయని ఎవరైనా అంటే త్రిపురనేని అంగీకరించక పోవచ్చు- ఎందుకంటే అప్పుడువ్యక్తికి ఆనాటి నిర్దిష్ట సామాజికస్థితి గతుల్లోనే తన జీవన విధానాన్ని నిర్ణయించుకోగల స్వేచ్ఛను ఒప్పు కోవల్సివస్తుంది అలా ఒప్పుకోవడం త్రిపురనేనికి ఏమాత్రం ఇష్టంలేని వ్యవహారం. "చైతన్యానికి మూలాధారమైన వాస్తవం మారినప్పుడే చైతన్యం మారుతుంది" 2 అన్నది నిజమే- అయితే ఆవాస్తవాన్ని మార్చడానికి అవసరమైన చైతన్యమైనా కావాలికదా ! వాస్తవాన్ని మార్చడం కోసమై పోరాటం సల్పగల చైతన్యం స్వీయ ఎరుక వున్నప్పుడే సాధ్యం. స్వీయ ఎరుక కలిగినవాడే సామాజిక ఎరుక కూడా కల్గి వుంటాడు- కనుక అట్టి వాడికి మాత్రమే వ్యక్తి చైతన్యం వుంటుంది.

అనాడు ప్రచారంలోవున్న పాలకవర్గ భావాలు మనిషిని అంధుడిగా, వెధవగా, సామాన్యుడిగా మారుస్తాయి- పాలకవర్గ భావాల నిజస్వభావాన్ని ఎరిగి, వాటిని ఆశ్రయించకుండా జీవితాన్ని గడపగలిగే వాడు మాత్రమే నిజమైన సామాజిక చైతన్యంతో కార్యోన్ముఖుడయ్యేది- అలా అని పైన చెప్పిన వ్యక్తి ఎరుక, చైతన్యం జ్ఞానవాదులు అమూర్తంగా వివరించేది కాదు. చాలా మూర్తమైనది (concrete) ఈ వ్యక్తిచైతన్యం. సమాజం లేదా ఇంకేదో శక్తి ప్రార్థించినందువల్ల, బలవంత పెట్టడంవల్ల ఒక వ్యక్తి విప్లవకారుడుగా మారడు. విప్లవకారుడు కావాలనుకోవడం సమాజంపట్ల తోటి మానవులపట్ల అతనికున్న నైతిక బాధ్యతను సూచిస్తుంది: అతను విప్లవకారుడుగా జీవించని పక్షాన ఎవరూ అతణ్ని నిందించరు. కనుక ఒక వ్యక్తి తన జీవితాన్ని అర్థవంతంగా, సక్రియమైన మార్గంలో మలచుకోవడానికి సమాజం నుండి అతను పొందిన ప్రకంపన, ఉత్తేజం మాత్రమే కారణమవుతాయి. ఈ విషయం ఒప్పుకోనంతవరకు మార్క్సిస్టులు మార్క్సు-ఎంగెల్సులు ప్రతిపదించిన చారిత్రిక భౌతికవాదాన్ని సిద్ధాంతపరంగా అంగీకరిస్తూనే ఆచరణలో మాత్రం దానికి విరుద్ధంగా వ్యక్తిని, గతితార్కికతని అగౌరవపర్చినట్లే అవుతుంది.

మార్క్సు తన 'థీసిస్ ఆన్ ఫ్యూర్ బా'లో దీన్ని గురించే చెపుతూ ఇలా అన్నాడు.

"భౌతికవాద సిద్ధాంతం మారే పరిస్థితుల గురించి, విద్య గురించి వివరించేప్పుడు పరిస్థితుల్ని మార్చేది మనుషులేనని, బోధకుడికి కూడా బోధించాల్సిన అవసరమున్నదన్న సత్యాల్ని మర్చిపోయింది... ఏక కాలంలో మారుతున్న పరిస్థితుల

మరియు మానవ చర్య లేదా స్వయం పరివర్తనను విప్లవాత్మక కార్యాచరణ రూపం లోనే శాస్త్రీయంగా అవగాహన చేసుకోగలం"[3]

కనుక తన పరిసరాల్ని మార్చేముందు తాను కూడా మారవలసిన అవసరముంది. పరిసరాల్ని మార్చడానికి పూనుకుని వాటిని మార్చడంలో తాను కూడా మారతాడు- బోధకుడికి కూడా సరైన అవగాహన అవసరంగా మార్క్స్ గుర్తించాడు- మార్క్స్ యొక్క ఈ మూడవ థీసిస్‌ని మర్చిపోయి చారిత్రిక భౌతిక వాదాన్ని దురవగాహన చేసుకుని మనిషి పరిస్థితులకు బానిస అని నమ్మి తాను మారాల్సిన అవసరం నుండి తప్పించుకోవడం నేర్చుకున్నాడు బలహీనుడైన మార్క్సిస్టు. మనిషి పరిస్థితుల్ని పరిమితస్థాయిలో సైతం అధిగమించలేడని 'మార్క్సిజం' బోధించింది కనుక తాను మారేందుకు ఆ విధమైన ప్రయత్నం చెయ్యడం దేనికి? దీనివల్ల మార్క్సిస్టు రచయితలు 'శాంతచిత్తులై', భద్రంగా ఏటువంటి తపనకు గురికాకుండా కాలం వెళ్ళబుచ్చుతున్నారు- సామాన్య మానవుడికి ఏమీ తీసిపోకుండా. ఈ తరహా నిర్ణయాత్మక వాదానికి (determinism) మార్క్సిస్టు కావాలనే లొంగుతున్నాడు సుఖాపేక్ష అధికమై. మార్క్సిజాన్ని అవగాహన చేసుకున్నవాడు, జీవితంపట్ల గౌరవం కలవాడు ఇలా మార్క్సిజంలో లేని నిర్ణయాత్మక వాదానికి తలవంచడు

ఈ విధంగా తప్పుడు అవగాహన చేసుకోవడంవల్లే సాహిత్యం ఇంత దుర్భరంగా వుండడం.

"ప్రతి యుగంలోనూ ప్రబలంగా వుండే భావాలు ఆ యుగ పాలకవర్గ భావాలే" అన్న మార్క్స్ వాక్యాన్ని త్రిపురనేని ఉదహరించారు- (మానిఫెస్టో) ఏ ప్రభుత్వమైనా మేధావుల్ని పోషిస్తుంది కనుక ఆనాటి పాలకవర్గానికి తొత్తులుగా వుండే రచయితలు, కవులు పాలకవర్గ భావాలనే సరియైన భావాలుగా ప్రచారం చేస్తారు. అందువల్లే ప్రతి యుగంలో ఆ యుగ పాలకవర్గ భావాలే ప్రబలంగా వుంటాయని మార్క్స్ అన్నాడు.

ఈనాడైనా ప్రబలంగా వున్న భావాలు పాలకవర్గానివే.

ఈ విషయాన్నే ఇంకా విపులంగా మార్క్స్ 'జర్మన్ ఐడియాలజీ' లో చర్చించాడు.

"పాలకవర్గ భావాలు ఆనాడు ఏలుబడిలో వున్న వర్గం యొక్క భావాలను పరిపూర్ణంగా ప్రతిబింబిస్తాయి. ఆ భావాలు ఆనాటి భౌతిక సంబంధాలకు ఆకృతి

నిస్తాయి. అట్టి భావాలే ఆ వ్యవస్థలో ప్రబలంగా ప్రచారంలో వుంటాయి. ... "ఆనాటి పాలకవర్గం ఆలోచనలు ఉత్పత్తి చేసేవారుగా, మేధావులుగా కూడా పరిపాలించి వారి భావాలను ఉత్పత్తి చేసి సరఫరా చేస్తారు. అందువల్ల వారిభావాలే ఆ యుగం యొక్క ప్రబలమైన భావాలు."4

అంతమాత్రంచేత పాలకవర్గానికి వ్యతిరేకంగా పోరాడే మేధావులు వుండ రన్న నిర్ణయానికి రాలేము. మార్క్స్ స్వయంగా పాలకవర్గానికి వ్యతిరేకంగా పోరాడాడు కదా! ఏ సమాజంలోనైనా ఆనాటి వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాడిన వారున్నారు కనకే చరిత్ర గమనం గతితార్కికంగా సాగేది. వ్యక్తికి సమాజానికి మధ్య కొనసాగే ఘర్షణ గతితార్కికంగా కొనసాగుతుంది- దాని ఫలితంగానే ఆ సమాజంలో మార్పు వస్తుంది.

'బూర్జువా సమాజంలో మనిషి వస్తుగత, విషయగత అధీనుడు' తాను స్వతంత్రంగా లేనని వ్యక్తి గ్రహించిన పదపే త్రిపురనేని చెప్పిన వస్తుగత, విషయగత అధీనత నుండి విముక్తి పొందడం కోసం పోరాటం ప్రారంభిస్తాడు. ఈ పోరాటం కొనసాగించాలంటే ముందు వ్యక్తి పాలకవర్గ భావజాలం నుండి విముక్తుడవాలి. వ్యక్తి ఈ భావజాలంనుండి విముక్తుడవడానికి సాహిత్యం తోడ్పడు తుంది. తద్వారా వ్యక్తి క్రియాశీలుడవుతాడు. అయితే పోరాటం చేస్తున్నంత మాత్రాన అతని జీవిత కాలంలోనే చరిత్ర, భౌతిక పరిస్థితులు సమూలంగా మార కుండానే గుణాత్మకంగా గొప్ప మార్పులేమీ జరగవు. అలా అని అతను తన పోరాటాన్ని విరమించుకోడు. అతనికి తెలుసు తానొక్కడే స్వేచ్ఛా జీవికాలేడని, అలా కాగలనని ఎవరైనా తలిస్తే అది అశాస్త్రీయమని. అయినా పోరాడ్డం అత నికి అనివార్యం. మనిషి జీవితంలో ఏనాటికైనా భౌతిక పరిస్థితులు మారడం ద్వారా నిజమైన మానవుడు ఉద్భవిస్తాడని శాస్త్రీయంగా తెల్సినవాడు కనుక అతను నిరాశకులోనుకాడు. కనుక ఇక్కడ వ్యక్తి చైతన్యం సామాజిక, భౌతిక పరిస్థి తుల్ని అధిగమిస్తుందని నా ఉద్దేశ్యం కాదు.

త్రిపురనేని వుదహరించిన వాక్యాల్నే "జంతువు దాని కార్యాచరణలో ఏకంగా వుంటుంది (పాలక వర్గ భావాలనే అంతిమ సత్యాలుగా స్వీకరించే మని షికి కూడా ఇది వర్తిస్తుంది) అది దాని కార్యాచరణ. కానీ మనిషి తన జీవిత కార్యాచరణనే తన సంకల్పానికీ, చైతన్యానికీవిషయంగా చేసుకోగలడు, అతనికి చైతన్య వంతమైన కార్యాచరణ వుంది".5 ఇక్కడ మననంచేసుకుంటే వ్యక్తికీవున్న ప్రాముఖ్యత సులువుగా బోధపడగలదు.

ఈవిధంగా వ్యక్తిని 'చైతన్యవంతమైన కార్యాచరణ'కు రచయిత సృష్టించే నిజమైన సాహిత్యం ప్రోత్సహించి వ్యవస్థకు వ్యతిరేకిగా మారుస్తుంది.

మారుతున్న పరిస్థితులను వ్యక్తపరిచే భావాలు ఎలా పుట్టేవి. ఆచరణను ఆలోచన, కల్పనాశక్తి ఎలా నిర్ణయించేది మార్క్స్-ఎంగెల్సులు అనేక చోట్ల వివరించారు.

చారిత్రిక భౌతికవాదం ప్రకారం భావాలు ఉత్పత్తి సంబంధాలచే నిర్ణయింప బడతాయి. అయితే మనం దీనిని ఖండితంగా (Rigid గా) నమ్మితే కొత్త భావాల పుట్టుకను గురించి సరియైన, సంతృప్తి పర్చగల సమాధానం ఇవ్వలేం మార్క్సిజం పుట్టుకను గురించికూడా చెప్పలేం. ఆనాటి భౌతిక పరిస్థితుల్లో మార్పులు, మార్పుకు ముందుగా తాత్విక, ఆర్థిక, రాజకీయ రంగాల్లో జరిగిన అభివృద్ధి కారణాలైనా, అవి మాత్రమే మార్క్సిజం పుట్టుకకు పూర్తి సమాధానం కానేరవు (ఇంకా వున్నది)

— సురేంద్రరాజు

---

1. సృజన. సెప్టెంబరు సంచిక, పేజీ 58. త్రిపురనేని వ్యాసం
2. సృజన, సెప్టెంబరు సంచిక, పేజీ 59, త్రిపురనేని వ్యాసం
3. "The materialistic doctrine concerning the changing of circumstances and education forgets that circumstances are changed by men and that the educator himself must be educated" (Theses on feurbach, from German ideology Page No. 646, Progress Publishers, Moscow, 1964)
4. "The ruling ideas are nothing morethan the ideal expression of the dominant material relationships, the dominant material production grasped as ideas, hence of the relationships, the dominant relationships which make the one class the ruling one, therefore the ideas of its dominance .. ... hence among other things then rule also as thinkers, as producers of ideas, and regulate the production and distribution of the of their age: There their ideas are the ruling ideas of the epoch" (German ideology, Page No. 60, Progress Publishers Moscow, 1964)
5. సృజన, అక్టోబరు సంచిక, పేజీ 13, త్రిపురనేని వ్యాసం & EPM of 1844, Page No. 73

# ఈశాన్యంలో రగిలిన ఇంధనం

భారతదేశంలో ఈశాన్య ప్రాంతాన ఐదు రాష్ట్రాలు, రెండు కేంద్ర పాలిత ప్రాంతాలు వున్నాయి. భూటాన్‌కు బంగ్లాదేశ్‌కు మధ్యవున్న 20 కి.మీ. భూభాగం నుంచి అవతలివైపుకు పోతే ఈ 'ఏడుగురు జబ్బుపడ్డ అక్కచెల్లెళ్ళు' కనిపిస్తారు. 2,55,034 చ.కి.మీ విస్తీర్ణాన్నాక్రమించి వున్న ఈఈశాన్య ప్రాంతంలో అస్సాం, మణిపూర్, మేఘాలయ, నాగాలాండ్, త్రిపుర రాష్ట్రాలూ, అరుణాచల్ ప్రదేశ్, మిజోరాం కేంద్రపాలిత ప్రాంతాలూ వున్నాయి. 1971 జనాభా లెక్కల ప్రకారం ఈ ప్రాంత జనాభా 1 కోటీ 96 లక్షలు. 1979 అంచనాల ప్రకారం ఈ సంఖ్య 2 కోట్ల 55 లక్షలు. ఈ ప్రాంతమంతా దాదాపు న్యూఢిల్లీ ప్రభుత్వ పాలన కిందికి వచ్చినప్పట్నుంచీ 'అనంత యుద్ధం' సాగిస్తూవున్నది. అస్సాంలో ప్రస్తుతం విద్యార్థుల నాయకత్వంలో ఉద్యమం సాగుతున్నది. బ్రహ్మపుత్ర లోయలోని 'అహోమ్'లు 'ఉదయాచల్' అనే పేరుమీద ప్రత్యేక రాష్ట్రం కోరుతున్నారు. మణిపూర్ 'మీతీ'లు థాయ్‌లాండ్ చరిత్రలో తమ పూర్వీకుల స్థానాన్ని వెతుక్కుంటున్నారు. మేఘాలయ "ఖాసీ"లు "మా ప్రాంతాన్ని వలసగా మార్చడానికి వీల్లేదు" అంటున్నారు. మేఘాలయ "గారో"లు, "జయంతియా"ల ప్రభుత్వ వ్యతిరేక పోరాటాలు నడుపుతున్నారు. నాగాలు స్వతంత్ర దేశాన్ని కోరుతున్నారు. త్రిపురలో స్థానిక గిరిజనులకూ, మైదాన ప్రాంతాల నుంచి వచ్చి పెత్తనం సాగిస్తున్న గిరిజనేతరులకూ మధ్య సంఘర్షణలు జరుగుతున్నాయి. అరుణాచల ప్రదేశ్‌లో అస్సాం ఉద్యమ ప్రేరణతో విజాతీయుల వలస వ్యతిరేక ఆందోళన కొనసాగుతున్నది. మిజో ప్రజలు సర్వసత్తాక మిజోరం కోసం 1965లో సాయుధ పోరాటం ప్రారంభించారు. మిజో పోరాట నాయకుని మాటల్లో "మిజోలు స్వేచ్ఛాప్రియులు. మాది స్వేచ్ఛా సమాజం. కులవ్యవస్థ, విగ్రహారాధన వున్న హిందూ సమాజంతో మిజో సమాజం ఏకీభవించే అంశమొక్కటీ లేదు"

ఇట్లా దేశంలో కీలకమైన సరిహద్దుప్రాంతమైన పన్నెండోవంతు భూభాగంలో నిరంతర అనిశ్చిత పరిస్థితి ఎందుకుంటున్నది ?

1824 కు ముందువరకూ దాదాపు మొత్తం ఈశాన్య ప్రాంతం బ్రిటిష్ భారతదేశంలో భాగం కాదు. సారవంతమైన బ్రహ్మపుత్ర లోయను బ్రిటిష్ వాళ్ళు బర్మారాజు నుంచి ఆక్రమించుకున్న తర్వాత ఈశాన్య ప్రాంతం ఢిల్లీ ప్రభుత్వ పాలనలోకి వచ్చింది. బ్రిటిష్ వలసవాదులు సహజంగానే ఇక్కడి ముడిసరుకులను ఇతర ప్రాంతాల అభివృద్ధికి వినియోగించారు.

వరి, తేయాకు, జనపనార, ఆవాలు, గోధుమ, వేరుశనగ, నూనెగింజలు, పొగాకు, చెరకు ఇక్కడి ప్రధాన పంటలు. సున్నపురాయి, పెట్రోలియం, బొగ్గు ఇక్కడ దొరికే ఖనిజాలు. కలప, ప్లైఉడ్, వెదురు, లక్క, ఇతర అడవి వస్తువులు ఇక్కడి సహజ వనరులు. ఈశాన్య ప్రాంతంలో వున్న బొగ్గు నిల్వలు 4000 మిలియన్ టన్నులు. వరి ఉత్పత్తి సంవత్సరానికి 28 లక్షల 28 వేలటన్నులు, గోధుమ 82 వేల టన్నులు, జనపనార లక్ష 55 వేల టన్నులు.

ఇంత సహజ సంపదతో విలసిల్లే ఈశాన్య ప్రాంతం పట్ల కేంద్ర ప్రభుత్వం చూపిన వివక్షత తెలుసుకుంటే ఈశాన్య ప్రజల "భారత వ్యతిరేకత"ను అర్థం చేసుకోవచ్చు.

ఈశాన్య ప్రాంతంలో 1600 కి.మి. ప్రవహించే బ్రహ్మపుత్రానదిపై ఇంత వరకూ చెక్క బహుళార్థ సాధక ప్రాజెక్టు కట్టలేదు. దేశంలోని భారీ ప్రాజెక్టుల సంఖ్య 22. ఇవి 9 రాష్ట్రాల్లోనే వున్నాయి.

దేశంలో 15,000 భారీ, మధ్యతరహా పరిశ్రమల్లో ఈ ప్రాంతంలో వున్నవి 21. వీట్లోనూ 8 ఇప్పుడు నిర్మాణంలో వున్నవే.

దేశంలోని 1 75,000 చిన్నతరహా పరిశ్రమల్లో 3000 మాత్రమే ఈశాన్య భారతంలో వున్నాయి.

దేశంలోని చమురు నిక్షేపాల్లో సగం అస్సాంలోనూ, మిగతా సగం గుజరాత్ పంజాబుల్లోనూ వుండగా చమురు, సహజ వాయువుల కమిషన్ ప్రధాన కార్యాలయం ఉత్తర ప్రదేశ్‌లోని డెహ్రాడూన్‌లో వుంది. చమురుశుద్ధి కర్మాగారాన్ని అస్సాంలోని చమురు నిక్షేపాల దగ్గర కాక బీహార్‌లో నిర్మించారు. బీహార్‌లోని బరౌనీ రిఫైనరీకి 1500 మైళ్ళ పైప్‌లైన్ ద్వారా సంవత్సరానికి 52 లక్షల 50 వేల టన్నుల క్రూడాయిల్ పోతుంది. బరౌనీ రిఫైనరీలో క్రూడాయిల్ శుద్ధికి అయ్యే ఖర్చు గౌహతి రిఫైనరీలో కంటె 1.7 రెట్లు ఎక్కువ.

అస్సాం నుంచి వచ్చే క్రూడాయిల్‌తో సంవత్సరానికి రు. 840 కోట్లు సంపాదిస్తున్న కేంద్ర ప్రభుత్వం అస్సాంకు రాయితీగా రు. 22 కోట్లు ఇస్తున్నది.

అస్సాంలో ఉత్పత్తి చేయబడే తేయాకు సంవత్సరానికి 270 మిలియన్ కిలోలు. దీని ఖరీదు రు. 400 కోట్లు. ఈ పరిశ్రమ మొత్తం కలకత్తా, లండన్ గుత్తపెట్టుబడిదారుల చేతుల్లో వుంది.

ఈశాన్య ప్రాంతంలో దొరికే కాగితపు గుజ్జు అంతా బయటి రాష్ట్రాల్లో కాగితంగా మారి ఈ ప్రాంతానికి తిరిగొస్తున్నది. అంటే ఈ ప్రాంతం తన భూభాగంలో సహజంగా దొరికే గుజ్జుతో తయారైన కాగితాన్నే బీహార్ నుంచో, బెంగాల్ నుంచో కొనుక్కుంటున్నది.

ఈ ప్రాంతపు ప్లైఉడ్ పరిశ్రమ మొత్తం కలకత్తా పారిశ్రామికవేత్తల చేతుల్లో వుంది. వాళ్ళు ఒక్క ఈ పరిశ్రమ మీదనే 600% లాభాలు పొందుతున్నారు.

దేశంలో 60,000 కిమీ. రైలుమార్గాలుంటే ఈశాన్య ప్రాంతంలో రైలు మార్గాల పొడవు 2.200 కిమీ. వీటిలో త్రిపురలో 12 కిమీ. నాగాలాండ్‌లో 9 కిమీ మాత్రమే వున్నాయి.

ఎరువుల వాడకం దేశంలో హెక్టేరుకి 29.8 కిలోలు కాగా ఈశాన్యప్రాంతంలో 1 87 కిలోలు.

దేశంలో 40% గ్రామాల్లో విద్యుదీకరణ జరిగితే ఈ ప్రాంతంలో 10% గ్రామాల్లో మాత్రమే జరిగింది.

1977-78 లో ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజిల్లో రిజిష్టర్ చేసుకున్న వారిలో దేశం మొత్తంమీద 13% మందికి ఉద్యోగాలు దొరికితే ఈశాన్య ప్రాంతంలో ఈ సంఖ్య 4% కి మించలేదు,

1947 నుంచి ఇప్పటి వరకు కేంద్రం ఈ ప్రాంతానికందజేసిన ఆర్థికసహాయం రు. 6000 కోట్లు. ఐనా అస్సాంలో 60%, మిగిలిన ఈశాన్య ప్రాంతంలో 50% ప్రజలు దారిద్ర్య రేఖకు దిగువన బతుకుతున్నారు- దేశం మొత్తంమీద ఈ సంఖ్య 40%.

దేశం మొత్తంమీద తలసరి ఆదాయం రు. 1278 కాగా ఈ ప్రాంతంలో రు. 824 మాత్రమే.

ఇవి ఈశాన్య ప్రజల "పరాయితనాని"కి ఆర్థిక కారణాలు.

భారత ప్రభుత్వం తమను వలసలుగా మారుస్తున్నదని, తమ దగ్గర దోచిన సహజ వనరులతో కొన్ని ప్రాంతాలను అభివృద్ధి చేసే వలస విధానాన్ని అమలు పరుస్తున్నదని ఈశాన్య ప్రజల అభిప్రాయం.

ఈ ఆర్థిక అసమానతలు అంతకుముందే సాంఘిక, సాంస్కృతిక కారణాలపై వున్న భారత వ్యతిరేక దృక్పథాన్ని తీవ్రతరం చేశాయి.

బ్రిటిష్ వాళ్ళు ఈ ప్రాంతాన్ని ఆక్రమించుకోగానే సహజంగానే మైదాన ప్రాంతాల నుంచి ఈ ప్రాంతానికి విజాతీయుల వలస ఆరంభమైంది. ఈ మైదాన ప్రాంతాల నుంచి వలస వచ్చినవాళ్ళు ఇక్కడ కొనసాగుతున్న పోడు వ్యవసాయం కంటె మేలైన వ్యవసాయాన్ని చేపట్టి ఈశాన్యప్రాంత జీవికంలో పాతుకుపోయారు. మొదటి రోజుల్లో ఇట్లా వలస వెళ్ళినవారిలో ఎక్కువ మంది బెంగాలీలు. వీళ్ళు క్రమక్రమంగా ఈశాన్యప్రాంతపు వ్యవసాయ, వాణిజ్య, ఆర్థిక రంగాల నుంచి రాజ్యాంగ యంత్రంలోకి అల్లుకుపోయారు– కనుకనే 1836 వరకే దాదాపు ఈ ప్రాంతంలో బెంగాలీ అధికార భాష ఐంది. సాంస్కృతిక రంగంలో ఈశాన్య జాతుల తిరుగుబాటు అప్పట్నుంచి ప్రారంభమయింది– 1846 లో అమెరికన్ బాప్టిస్ట్ మిషనరీలు అస్సామీ భాషలో మాసపత్రిక "అరుణోదయ"ను ప్రారంభించి అస్సామీ భాషకు గుర్తింపునిచ్చారు. ఈవిధంగా 1930 నాటికే "... (విజాతీయులు) భాషనూ సంస్కృతినీ నాశనం చేయడానికి వస్తున్నారు– కాని అందరూ తమ తమ దేశాల్లో ఖర్చు పెట్టుకోవడానికి ఇక్కడి సంపదను కొల్లగొట్టుకపోయే వాళ్ళే. ఉద్యోగం అనే సమస్య కేవలం భౌతిక అవసరాలు తీర్చుకునే సమస్య మాత్రమే కాదు– అది ఆధికారం, అవకాశం, సంస్కృతులకు సంబంధించిన సమస్య..." అనే భావన వచ్చింది. ఆ తర్వాత ముఖ్యంగా నేపాలీ, మార్వాడీ, పంజాబీలు ఇక్కడికి వలస వచ్చారు.

ఈ విజాతీయుల వలస ఈశాన్య ప్రాంతంలో స్థానిక గిరిజనులను, ప్రజలను మైనారిటీగా, విజాతీయులను మెజారిటీగా మార్చింది. ఒక్క అస్సాంలోనే 1971 జనాభా లెక్కల ప్రకారం 1 కోటి 46 లక్షల జనాభాలో 59 లక్షల 50 వేల మంది మాత్రమే అస్సామీయులు.

ఇట్లా తమ అవకాశాలను తన్నుకుపోతున్న, తమ మాతృభూమిలో తమను మైనారిటీగా మార్చిన 'విజాతీయుల' మీదికి ఈశాన్య ప్రాంతం విరుచుకుపడింది.

ప్రతిఘటన ఈశాన్య ప్రజల స్వభావంలో వుంది. అస్సాం (అహోమీ) కొండ జాతి ప్రజలు 600 ఏళ్ళపాటు విదేశీ దురాక్రమణలను సాహసవంతంగా తిప్పికొట్టారు. గత నూట యాభై ఏళ్ళలో జరిగిన చెప్పుకోదగిన గిరిజన తిరుగుబాట్లు 86 లో 39 ఈశాన్య ప్రజానీకం చేసినవే.

నాగాలు 1956లో, మిజోలు 1965లో ప్రభుత్వ వ్యతిరేక సాయుధ పోరాటం ప్రారంభించారు. మళ్ళీ ఈశాన్య ప్రాంతపు జనజీవనంలో కుదుపు నిచ్చిన ఉద్యమం 1979లో ప్రారంభమైన 'బహిరాగతుల' బహిష్కరణ ఉద్యమం. అస్సాంలో పదకొండు సంఘాలు కలిసి ఏర్పరుచుకొన్న అఖిల అస్సాం గణసంగ్రామ పరిషద్ ఈ ఉద్యమాన్ని ప్రారంభించింది. దీంట్లో క్రియాశీలంగా పాల్గొంటున్న సంఘాలు అఖిల అస్సాం విద్యార్థి సంఘం, అస్సాం జాతీయతావాది దళ్, పూర్వాంచలీయలోక పరిషత్. వీటికి సైద్ధాంతిక ఆలోచననిస్తున్నది అస్సాం సాహిత్య సభ.

ఇక ఈ ప్రేరణతో మళ్ళీ ఈశాన్య ప్రాంతం జూలు దులిపింది. ప్రతి రాష్ట్రంలోనూ విజాతీయుల వలస వ్యతిరేక ఆందోళన ప్రారంభమైంది. ఏప్రిల్ 5న అస్సాం (కచార్ జిల్లా మినహా) కల్లోలిత ప్రాంతంగా ప్రకటించబడింది. అంతకు ముందే 1955, 56 ల్లో నాగాలాండ్, 1966లో మిజోరం, 1978లో మణిపూర్ (1956లో కొంత ప్రాంతం) కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించబడ్డాయి. కల్లోలిత ప్రాంతంగా ప్రకటించిన తరువాత అస్సాం వెళ్ళిన ఒక విలేఖరితో ముగ్గురు బిడ్డల తల్లి, నలభై ఎనిమిదేళ్ళ కృష్ణసైకియా "వాళ్ళు తుపాకులతో మమ్మల్ని భయపెట్టలేరు" అన్నది. అస్సాం ఉద్యమంలో మహిళల సంఖ్య మొత్తం మహిళల సంఖ్యలో 60% వుంటున్నది.

ప్రభుత్వపు చాక్లెట్లు విసిరే విధానమూ, తుపాకి ఎక్కుపెట్టే విధానమూ-రెండూ ఈశాన్య ప్రజల పోరాట సాంప్రదాయం ముందు వీగిపోయాయి.

ఒక బెంగాలీ కవిగీతంలో స్వేచ్ఛగా వున్న పక్షి పంజరంలో వున్న పక్షిని బయటికి రమ్మని అడుగుతుంది. పంజరంలో వున్న పక్షి "బయటి ప్రపంచంలో పట్టుకోవడానికి ఊచలుండవుగదా" అంటుంది. అట్లాగే, సాగుతున్న ఈ పోరాటాలను అణచివేయడానికి దేశంలోని అన్ని పార్లమెంటరీ రాజకీయ పార్టీలు అధికార పార్టీతో చేతులు కలపడానికి పోటీలు పడుతున్నాయి.

ఐనా ఈ ప్రతిబంధకాలన్నిటినీ దాటుకుని ఇప్పటికే జాతీయ విముక్తి పోరాట పథంలో వున్న మిజో, నాగా, మణిపూర్ దారిలో మిగతా ఈశాన్య ప్రాంతమంతా నడిచి భారతదేశానికి 'తూర్పు వెలుగు' నిస్తుందని ఆశిద్దాం.

— వేణు

సాహిత్య లేఖ :

'శ్రీశ్రీ - ఆధునిక విమర్శకుడు'లో శ్రీ త్రిపురనేని మధుసూదనరావుగా
తిక్కన, వేమన, గురజాడల గురించి రాస్తూ 'గురజాడ బూర్జువా కవి అని, తిక్క
ఫ్యూడల్ కవి అనీ, వేమన వ్యాపారస్తుల కవి అనీ యీ ముగ్గుర్నీ పరిజా
లనడం అభ్యుదయ విమర్శకు విరుద్ధమ'నీ అన్నారు.

వ్యాసమంతా ఎంతో చక్కగా పరిణతి కలిగిన భావాలను సూటిగా సజెష్టి
చెప్పిన శ్రీ త్రిపురనేని మధుసూదనరావుగారు యీ విషయంలో అన్యాయంగా కేవ
శ్రీశ్రీ అభిమానిస్తున్నందు వల్లనే వ్యతిరేకిస్తున్నట్టు అనిపించేటట్టుగా తిక్కన
వేమననీ, గురజాడనీ వేరువేరుచేసి, లేనిపోనివి ఆపాదించి రాయడం యుక్త
అనిపించడం లేదు.

ఒక వ్యవస్థని కాపాడేందుకు యే కవి అయినా, ఆ వ్యవస్థకు తగ్గ
కవిత్వం రాస్తే, ఆ కవి ఆ వ్యవస్థకు చెందిన కవి అవుతాడు. మన అగ
కవులు, యింకా నానారకాల డిటెక్టివ్, సెక్స్, ఎస్కేపిజం, సెంటిమెంటల్
లైన చౌకబారు, చెత్తసాహిత్యం రాసే రచయితలు, కవులు యిప్పటి సమాజ
అభ్యుదయకరమైన మార్పుని కోరని, యీ సమాజపు విలువల్ని, సామాజిక,
సంబంధాల్ని సమర్థించే, లాభం పొందే కవులు, వీరంతా యీ వ్యవస్థకి చె
కవులు. వీరు మరో ప్రపంచపు వ్యవస్థను దర్శించలేరు- ఊహించనైనా
అలా కాక అప్పటివరకూవున్న వ్యవస్థని కాదని, కొత్తమార్గాన్నీ, కొత్త ప్రపంచ
అభిలషించే, సూచించే, దర్శించే కవి, ఆ వర్గసమాజంలోనే వున్నప్పటికీ,
కవిత్వంద్వారా మరో సమాజాన్ని దర్శించడంవల్ల ప్రయోజనకారియైన మరో ప్ర
చపు కవి అవుతాడు.

మరి యీ విధంగా ఆలోచించినపుడు తిక్కన సంగతి నాకు సరిగ్గా తెలి
పోవడంవల్ల రాయలేకపోతున్నాను గానీ, గురజాడగానీ, వేమనగానీ అప్పటివ
వున్న తమ పరిధిలోని చెడ్డ విలువల్ని తిరస్కరించి భవిష్యత్తుకు సాహిత్య
గానూ, సంఘపరంగానూ మంచి మార్గాలు వేశారు.

గురజాడ బూర్జువా కవి అనీ, అంతనా మరీ అన్యాయంగా వేమన వా
రస్తుల కవి అనీ అనడం సంకుచితమైన విమర్శ తప్ప మరేమీ కాదు.

బూర్జువా సమాజపు ఆశయాలను, దోపిడీని గురజాడ సమర్థించలేదు.
మొదటగా మనిషి అస్తిత్వాన్ని గుర్తించిన మహాకవి ఆయన తనకు తె

రిధిలో జరిగే దోపిడీని ఆయన ఎదిరించాడు- ఖండించాడు. వేమన కూడా తన మాజపు దోపిడిని సమర్థించలేదు- వ్యాపారస్తులకూ, రాజులకూ, పురోహితులకూ త్తాసివ్వలేదు- నిక్కచ్చిగా ఎదిరించాడు. కాబట్టే జనం గుండెల్లో యింకా నిలబడి న్నాడు. వేమనగానీ, గురజాడగానీ సంపూర్ణంగా విప్లవకవి ఎందుకు కాలేదు నాటి నక్సలైట్లవలె ప్రజల్లోకిపోయి నేర్చుకుని ప్రజాసాహిత్య పంథా ఎందుకు వలంబించలేదనటం గతితార్కికతత్వంతో విమర్శించడం అవదు.

శ్రీశ్రీ, గురజాడ కవిత్వంలోనూ, కన్యాశుల్కంలోనూ లోపాల్ని కూడా రాపించాడు అని ఒకపక్క అంటూనే శ్రీశ్రీ యొక్క అభిమానం వారిపై సహేతు ంగా లేదనడం యేమిటో మరి?

— నటరాజ్

---

tatement about ownership and other particulars about newspaper

## SṚJANA

| | | |
|---|---|---|
| Place of publication | ... ... | Warangal 506 001 |
| Periodicity of its publication | ... | Monthly |
| Printer's Name | ... ... | P. Hemalatha |
| Nationality | ... ... | Indian |
| Address | ... ... | Hanamkonda Warangal 506 001 |
| Publisher's Name | ... ... | P. Hemalatha |
| Nationality | ... ... | Indian |
| Address | ... ... | (same as above) |
| Editor's Name | ... ... | P. Hemalatha |
| Nationality | ... ... | Indian |
| Address | ... ... | (same as above) |
| Names and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | | —— |

I, P. Hemalatha hereby declare that the particulars given bove are true to the best of my knowledge and belief.

Sd/- P. Hemalatha
Publisher.

**SRJANA Telugu Monthly** **June/July '80** **H/WL-10**
**Regd. No. with Registrar of News Papers 10953/67**

# హైదరాబాద్ బుక్ ట్రస్ట్

10-1-17/2 మొదటి ఫ్లోరు, శ్యామ్‌నగర్, హైదరాబాద్ 500 004.

తొలి ప్రచురణలు వెలువడినవి

1. వేమన్న వాదం — వ్యాఖ్యాత డా॥ ఎన్. గోపి
   సాదా ప్రతి : 5-00 మేలు ప్రతి : 10-00
2. కూలి గింజలు — శ్రీ తర్కశ్రీ శివశంకర శాస్త్రి
   తెలుగు : సహవాసి — సాదా ప్రతి : 4-50 మేలు ప్రతి : 8-00
3. రక్తాశ్రువులు — సిడ్నీ గోర్డన్, టెడ్ అలెన్
   తెలుగు : సహవాసి — సాదా ప్రతి : 7-50 మేలు ప్రతి : 13-50

ప్రతులకు, వివరాలకు : పై అడ్రసుకు రాయండి.

మా గురించి...

తెలుగు సాహిత్యానికి శాస్త్రీయ, వైజ్ఞానిక, సాంస్కృతిక విలువల్ని ఇతోధికంగా సంతరింపజేయాలనే ధ్యేయం హైదరాబాద్ బుక్ ట్రస్టుగా రూపుదిద్దుకొంది.

సాహిత్యాభిమానులైన మిత్రులనుండి సేకరించిన విరాళాలతో ఆర్థిక వనరులు సమకూర్చుకొన్న ఈ సంస్థకు లాభార్జన ధ్యేయంకాదు. తెలుగునాట ఒక ఉత్తమ పుస్తకోద్యమం అంకురించాలన్నదే యీ సంస్థ ఆకాంక్ష.

ప్రతిభావంతులైన తెలుగు రచయితల మౌలిక రచనలతో పాటు ఇతరేతర భాషల్లో వెలువడ్డ ఉత్తమ రచనల్ని సంపూర్ణ, సంక్షిప్త రూపాల్లో ప్రచురించి ప్రచారంలోకి తేవాలని మా సంస్థ సంకల్పించింది. ఈ కృషిని నిరంతరం కొనసాగించటానికి కృత నిశ్చయంతో వుంది.

పదికాలాలపాటు యీ సంస్థ పదిలంగా నిలబడటానికి పాఠకుల సౌహార్దం బాసట కావాలి మీరంతా దాతలుగా, పోషకులుగా, వ్యవస్థాపక సభ్యులుగా, శాశ్వత సభ్యులుగాచేరి ఆర్థిక, హార్దిక సహాయసహకారాలు అందజేయమని అభ్యర్థిస్తున్నాం.

మా పుస్తకాల మీద మీ ఆలోచనలు అభిప్రాయాలకు, మా సంస్థ ప్రగతి వికాసాల గురించి మీ అమూల్యమైన సలహాలకు సాదరంగా స్వాగతం పలుకుతాం. రాయటం మర్చిపోకండి.